# ప్రియదర్శి అశోక

ధీరేంద్రలాల్ ధర్





# ప్రియదర్శి అశోక

భారత ప్రభుత్వ విద్యాశాఖవారు నిర్వహించిన సార్వజనీన గ్రంథ రచన పోటీలలో, 1954 సం. ప్రథమ బహుమతి నందుకొన్నది.


నవోదయ పబ్లిషర్స్

విజయవాడ - 2.

# ము ం దు మా ట



అశోక చక్రవర్తి రెండువేల సంవత్సరములకు పూర్వము జన్మించెను. మన మాతని గూర్చి పూర్వ గ్రంథముల వల్ల, బౌద్ధమత గ్రంథముల వల్ల తెలిసికొనగలము. 1750 సంవత్సరమున నొక క్రైస్తవ మతాచార్యుడు ఢిల్లీలో ఒక అశోక స్తంభమును కనుగొనెను; కాని దానిపై నున్న లిపి ఆతనికి బోధపడలేదు. అప్పటినుండి అనేక అశోక స్తంభములు కనుగొనబడెను; కాని లిపి మాత్రము పరిష్కరింపబడలేదు. చరిత్రకారులు అతి పరిశ్రమపైన 1837వ సంవత్సరమునాటికి కా లిపిని పరిష్కరించ గలిగిరి. అనంతరము చరిత్రకారులు స్థూపములపైన, స్తంభములపైన, పూర్వావశేషములపైన, శిలాఫలకముల పైన చెక్కిన శాసనములను, ప్రకటనలను చదివిరి. ఆ కృషి ఫలితముగ వారు అశోక చరిత్రను సవివరముగ రూపొందింప గలిగిరి. ఆ మహా చక్రవర్తి గొప్పతనము, ధర్మదీక్ష చరిత్రకారుల మెప్పు పొందుటే గాక, ఈ ప్రపంచమున అంతటి మహా చక్రవర్తి మరొకరు పుట్టలేదని వారికి నమ్మకము కలిగించెను.

స్వతంత్ర భారత మిప్పుడు తన పూర్వపు ఔన్నత్యమును సంపాదించవలెనని ప్రయత్నించుచున్నది. భవిష్యత్తెల్లపుడు గత విజ్ఞానముపై ఆధారపడి యుండును. మన దేశ గత చరిత్రలో అశోకుని జీవితము చాల ప్రఖ్యాతి గాంచి యుండెను. అట్టి చరిత్రను నేను నా శక్తికొలది వివరించ

యత్నించితిని. ఆ మహా చక్రవర్తి ఔన్నత్యమును కండ్లకు కట్టినట్లు వివరించగల నైపుణ్యము నా కలమునకు లేదను విషయము నాకు తెలియును. అయినప్పటికి, చదువరులకు ఈ పుటలు చదివిన తరువాత సర్వమానవ సౌభ్రాతృత్వమును వెల్లడించిన మహోన్నత తత్త్వధర్మమును, అహింస, స్వార్థ పరిత్యాగములను ప్రవచించిన సిద్ధాంతములతో నేటికన్న ఎక్కువ ఖ్యాతి సంపాదించునట్లుగ భావి భారత దేశమును రూపొందించవలయునను భావము కలిగిన నా కృషి ఫలించిన దని సంతోషించెదను.

ముఖ్యముగ, ప్రఖ్యాతిగాంచిన చరిత్రకారులకు, ఈ రచనకు నాకు సహకరించిన వారి ఉత్తమ గ్రంథములకు, అనగా డాక్టరు రాధాకుముద ముఖర్జీ, డాక్టరు డి. ఆర్. బండార్కరు, డాక్టరు సురేంద్రనాథసేన్, విన్సెంటు స్మిత్ గార్లు వ్రాసిన అశోక చరిత్రలకు నా కృతజ్ఞతాభి వందనములు.

— ర చ యి త.

# వంశవృక్షము.

—:o:—

తండ్రి — బిందుసారుడు.

తల్లి — సుభద్రాంగి.

సోదరులు — i. సుషీముడు అని పిలువబడు సుమనుడు;
ii. సవతి సోదరుడు వీతశోకుడు అనిగాని, విగతశోకుడు అనిగాని పిలువబడు తిష్యుడు;
iii. వీతశోకుడు.

రాణులు — i. శాక్యకుమారీదేవి;
ii. కారువాకి,
iii. అసంధిమిత్ర;
iv. పద్మావతి;
v. తిష్యరక్షిత.

కుమారులు — i. మహేంద్రుడు - తల్లి శాక్యకుమారీదేవి;
ii. తీవరుడు - తల్లి కారువాకి;
iii. కుణాళుడు - తల్లి పద్మావతి;
iv. జలౌకుడు.

కుమార్తెలు — i. సంఘమిత్ర - తల్లి శాక్యకుమారీదేవి;
ii. చారుమతి.

అల్లుళ్ళు — i. సంఘమిత్ర భర్త అగ్నివర్మ;
ii. చారుమతి భర్త దేవపాలుడు.

మనుమలు — i. దశరథుడు;
ii. కుణాళుని కుమారుడు సంప్రతి;
iii. సంఘమిత్ర కుమారుడు సుమనుడు.

# నవోదయ బాల సాహిత్యం

---

| | | |
|---|---|---|
| ప్రియదర్శి అశోక | ధీరేంద్రలాల్ ధర్ | 0 75 |
| అపరంజి | సభా | 1 25 |
| ప్రథమ భారత విప్లవ గాథలు | ,, | 1 00 |
| ఐకమత్యం వుంటే | ,, | 0 75 |
| డాక్టరు కోకిల | ఎంగ్లోరా | 0 75 |
| విచిత్ర కన్యలు | నండూరి సుబ్బారావు | 0 75 |
| తామర కన్య | ,, | 0 75 |
| వసపిట్ట వామనరావు | నార్ల చిరంజీవి | 0 75 |

# ప్రియదర్శి అశోక

## 1. అశోకుడు సింహాసన మెక్కుట

అనేక వందల సంవత్సరములకు పూర్వము, గంగానదీ తీరమున పాట్నా సమీపమున ఒక పెద్ద నగరము వెలసెను. ఆ పట్టణము పొడవు ఎనిమిది మైళ్లు; వెడల్పు రెండుమైళ్లు. నగరము చుట్టు కొయ్యతో నిర్మించిన ఎత్తగు ప్రాకారముండెను. ఆ ప్రాకారము చుట్టు నాల్గు వందల మూరల వెడల్పు, ముప్పది మూరల లోతుగల కందక ముండెను. ఆ కందకమును గంగా సదెల్లపుడు నీటితో నింపి యుంచెడిది. కోటలో ప్రవేశించుటకై కందకముపై అరువదినాల్గు ద్వారములుండెడివి. ఆ కోటకు ఎత్తగు ఐదువందల డెబ్బది బురుజులుండెను. ఆ బురుజులపై నుండి రక్షకభటు లెల్లవేళల పహరా ఇచ్చుచుండెడివారు. శత్రువులపై బాణము లెక్కుపెట్టి విడచుట కనువుగ ఆగోడలో వందలకొలది కంతలుండెను. రక్షకభటు లెల్లపుడు కోట గోడపై ఒక బురుజునుండి మరియొక బురుజునకు మారుచు పహరా ఇచ్చుచుండెడివారు.

అది చాల అందమైన పట్టణము. ఇండ్లన్నియు కొయ్యతో నిర్మింపబడి, రంగు రంగుల చిత్రములతోను, సుందరమగు అలంకారములతోను చూడ ముచ్చట గొల్పు

(2)

చుండెడిది. అదియే అందమగు పాటలీపుత్రము; మగధ సామ్రాజ్యమునకు ముఖ్య పట్టణము. చక్రవర్తి అజాత శత్రువు తన ముఖ్య పట్టణమును, "భవిష్యత్తులో ఈ నగరము హిందూ దేశమున మొట్ట మొదటి పట్టణమై, భారతీయ నాగరికతకు, విజ్ఞానమునకు కేంద్రమగును" అను బుద్ధ భగవానుని ఆశీర్వచనమును బడసి నిర్మించెను.

మౌర్య చక్రవర్తులకీ పట్టణమే నివాసము. రాజ ప్రాసాదము నగర మధ్యమున నుండెడిది. ఆ ప్రాసాదములో దారు నిర్మితములగు ఏడు భవంతు లుండెను. పెద్ద పెద్ద స్తంభములు, ఎత్తగు విలువంపైన నరంబీలు గలిగి లక్క పూయబడి, వెండి బంగారములతో అలంకరింపబడి యుండెను. కొన్ని వందల సంవత్సరముల అనంతరము, చైనా రాయబారి ఫాహియాన్ ఈ పట్టణమును దర్శించినపుడు, అందు రాజ ప్రాసాదమును చూచి ముగ్ధుడయ్యెను. "బ్రహ్మాండమగు ఈ కట్టడములు మానవ నిర్మితములు కావు. ఏ భేతాళునివంటి భూతము సహాయముననో మగధ చక్రవర్తి దీని నిర్మించి యుండవచ్చును" అని ఆతడు వ్రాసుకొనెను. మగధ చక్రవర్తుల రాజ ప్రాసాద మంతటి దివ్య భవనము.

క్రీస్తుకు రెండు వందల ఏబది సంవత్సరముల పూర్వము మగధ చక్రవర్తి బిందుసారుడు ఈ రాజ ప్రాసాదముననే నివసించెను. ఆతని రాజ్యము ఆఫ్ఘనిస్థానము (గాంధారము) నుండి మైసూరు వరకు వ్యాపించి యుండెను. రెండు సరిహద్దు రాష్ట్రములకు ఇద్దరు యువరాజులు రాజ ప్రతినిధులుగ

నుండిరి. రాకుమారుడు సుషీముడు రాజ్యమునకు ఉత్తర హద్దులో నున్న తక్షశిలకును, రాకుమారుడు అశోకుడు దక్షిణ సరిహద్దులో నున్న రాష్ట్రమగు ఉజ్జయినికిని రాజ ప్రతినిధులుగ నుండెడివారు.

సుషీము యువరాజు తన రాచ కార్యములందు ప్రమత్తుడై యుండెను. తన ఉద్యోగులు ఏది చేసినా దాని నెల్ల సమ్మతించుచు, ఏమి చెప్పినా దానినెల్ల విశ్వసించుచుండెను. రాజోద్యోగులా అవకాశమును తీసుకొని, యథేచ్ఛగా ప్రవర్తింపజొచ్చిరి. ప్రజలకు యువరాజు దర్శనము అందని పండాయెను. సుషీము డెల్లపుడు నాట్య సంగీతములతోను, మధుపానముతోను కాలము గడుపుచుండెను. ఈతడు రాజునకు పెద్దబిడ్డ. కొలది కాలములోనే మగధ సింహాసనము నధిష్ఠింప వలసియుండెను. ఈతనికి ప్రజల మొరాలకించుట కప్పుడుమాత్ర మవకాశ మెక్కడుండును.

తక్షశిల ప్రజ లెంతమాత్రము భరించలేక, "ఇట్టి రాజ ప్రతినిధి మాకవసరము లేదు; ఆతనాజ్ఞలను మేమెంత మాత్రము తలదాల్చ జాలమని" తిరుగుబాటు చేసిరి.

తిరుగుబాటు వార్త పాటలీపుత్రమునకు వార్తాహరుని ద్వారా తెలిసెను. అతడన్ని విషయములు రాజసభలో విన్నవించెను. సరిహద్దు రాష్ట్రమున శాంతి భద్రతల నెలకొల్పుటకు తక్షణమే సైన్యమును పంపవలసినదిగా చక్రవర్తిని కోరెను.

రాజాజ్ఞయైనది. చతురంగ బలములు బయలు వెడల సిద్ధపరుపబడెను. మహాసముద్రమువంటి ఆ సైన్యమున కెవ్వరు నాయకత్వము వహించగలరు? రాజెవరిని విశ్వసించవలెను?

బిందుసార చక్రవర్తి ప్రధాన మంత్రి ఖల్లాటకుని సలహా అడిగెను. యువరాజు అశోకుడు అన్ని విధముల సమర్ధుడు ఆతని తప్ప మరెవ్వరిని నమ్మరాదని ప్రధాని సలహా.

కాని, యువరాజు అశోకుడు వయసున చాల చిన్న వాడు. అంత మహా సైన్యమును నడిపించు టాతనికి సాధ్యమగునా? భవిష్యత్తు సాధువులకు, సన్యాసులకు తెలియును. కాన, అశోకుని భవిష్యత్తును తెలిసుకొనవలెనని, చక్రవర్తి పింగళవత్సుడను సన్యాసి వద్ద కేగెను. పింగళవత్స మహా ఋషి అశోకుని జాతకమును చూచి, "అశోకు డన్నివిధముల సేనానాయకుడుగ నుండుటకు తగినవాడు. ఆతని కా ప్రజ్ఞ, సామర్థ్యములు కలవని" చెప్పెను.

మహాముని పింగళవత్సుడు చెప్పిన దెన్నడును కల్ల కాలేదు. ఉజ్జయిని నుండి అశోకుని, చక్రవర్తి పాటలీపుత్రము పిలిపించి, సైన్యము నంతను ఆతనాధీన మొనర్చెను. అంతట అశోకుడు తన మంత్రి రధగుప్తుని వెంట నిడుకొని, బంగారు జలతారుతో అలంకరింపబడిన ఏనుగు నెక్కి తక్షశిలకు బయలుదేరెను. ఆ సమయమున శంఖనాధము చేయ బడెను. వాన కురిసినట్లు పుష్పములు పైద జల్లబడెను. యుద్ధమునకు వెడలు సైనిక విన్యాసమును చూచు ప్రజా సమూహాముతో పుర వీధులన్నియు క్రిక్కిరిసెను.

మగధ సైన్యము పురోగమించుచుండెను. అలగ్జాండరు చక్రవర్తి ఎదిరించుటకు సాహసమూనక, పంజాబు నుండియే తన సైన్యమును వెనుకకు మరల్చుకోవలసిన స్థితిని కల్పించిన ఆ అజేయమైన సైన్యమే ఇది. తక్షశిలలోని ఆ కొద్ది మంది తిరుగుబాటుదార్లు ఎదిరించుటకు శక్యమా? వారు పారిపోయిరి. పట్టణమున ప్రశాంతి నెలకొల్పబడెను. అంతట అశోకుడు కొలువు దీర్చి ప్రజల రావించెను. తమ బాధలను నివేదింప కోరెను. తమ అసంతృప్తికి కారణములను తెలుప వలసినదనెను.

"మాకు వేరొక యువరాజు కావలెను. రాకుమారుడు సుషీముని పాలనలో మాకు ఆలన పాలన లభించుటలేదు. మమ్మాతని బాధలనుండి గాని, మితిమీరుచున్న రాజోద్యోగులు పెట్టు క్రూరబాధలనుండి గాని కాపాడుటకు ప్రయత్నించుటలేద" ని ప్రజలు విన్నవించిరి.

ఈ వార్త పాటలీపుత్రము చేరెను. ఆ రోజులలో రాజులు ప్రజారంజనమే ప్రధమ కర్తవ్యముగా భావించెడివారు. శ్రీరామచంద్రుడు తన ప్రజల సంతృప్తి పరచుటకు సీతాదేవిని అరణ్యవాసమున కంపెను. బిందుసార చక్రవర్తియును సుషీముని పాటలీపుత్రమునకు తిరిగి రావరసినదని, నాటి నుండే అశోకుడు తక్షశిల కుపరాజు కావలెయునని ఆజ్ఞాపించెను.

చక్రవర్తి ఆజ్ఞను సుషీముడు మన్నించవలెను కనుక, పాటలీపుత్రమునకు తిరిగివచ్చెను.

కాని, సుషీముడు తన అలవాట్లు మార్చుకోజాల డయ్యెను. సౌఖ్యప్రియుడగు ఆ యువరాజు అహంకార ప్రవర్తన రాజాస్థానములోని ప్రతివారికి అసహ్యము కలిగించెను. ఒకరోజున చక్రవర్తి, "కుమారా! నీ ప్రవర్తన మార్చుకొనవలెను. లేనియెడల ముందు నీవు మగధ సింహాసనము నధిష్ఠించినపుడు, ఇట్లి సంతృప్తినొందిన ప్రజలలో శాంతి భద్రతల నెలకొల్పజాల" వని యువరాజును హెచ్చరించెను.

అయినను, సుషీముడు తన ప్రవర్తనను సరిదిద్దుకొనలేకపోయెను. బిందుసారుడు ఆతనిని గూర్చి మానసికముగ చాల వ్యథ చెందుచుండెడివాడు. కాని, కుమారుని సరిదిద్దు దారి గాంచలేకపోయెను. రాజు వృద్ధుడయ్యెను. కుమారుని గూర్చిన ఆ మనోవ్యథతో ఆతని ఆరోగ్యము చెడిపోయెను. అస్వస్థుడై కొలది కాలమునకు చక్రవర్తి మరణించెను.

సుషీముడు చక్రవర్తికి పెద్దబిడ్డ; సింహాసనమునకు వారసుడు. అయినను మంత్రులకు, సభికులకు, ప్రజలకు మాత్ర మాతనియందు ప్రీతి లేకుండెను. ప్రధానమంత్రి ఖల్లాటకుడు మంత్రిమండలి సమావేశపరచెను. సుషీముడు రాచకార్యముల నిర్వహించుటకు తగడని, ఆతని సోదరుడు అశోకుడు చక్రవర్తిగ నుండుటకు తగినవాడని మంత్రిమండలి నిర్ణయించెను. ఆ నిర్ణయము ప్రకారము ప్రధాన మంత్రి ఖల్లాటకుడు వార్తాహరునిచే తక్షశిలకు ఒక జాబు సంపెను.

అశోకుడు వార్తాహరుని తెల్లని దుస్తులకు వెరగు పొందెను. భయపడెను. ఒణకుచు జాబందుకొనెను. ఆ జాబు

ప్రధాని ఖల్లాటకుడు వ్రాసినది. ఆ జాబునందు, "రాజాధి రాజు, రాజమార్తాండులు, రాజ ప్రతాపులునగు బిందుసార చక్రవర్తులుంగారలు దివంగతులైరి. కాని, మనమిపుడు విచారించుటకు వ్యవధి లేదు. ఎందువల్లనన, సరిహద్దులందు మన శత్రులు పొంచి యుండిరి. ప్రజల ప్రాణ ధనముల సంరక్షణకు సింహాసనము వెలితిగ నుండరాదు. సామ్రాజ్యమును పరిపాలించుట సామాన్యము కాదు. ఇంతటి సువిశాలమగు సామ్రాజ్యమును సుషీముడు పరిపాలించుట ఎంత వరకు సాధ్యమను విషయమున మాకు పాలు పోకున్నది. కనుక, ఈ విషయమును గూర్చి జాగ్రత్తగా మిమ్మాలోచింప గోరెదము" అని యుండెను,

రధగుప్తుడా జాబును తీసికొని, ఆమూలాగ్రము చదివి "ఓ యువరాజా, మగధ సామ్రాజ్యపు ప్రధాన మంత్రి మిమ్ములు మగధ సింహాసనమెక్క వలసినదని ఆహ్వానించుచున్నాడు." అని వివరించెను.

"సింహాసనము కొరకు నా అన్నతో పోరాడవలసి యున్నదా ?" అని అశోకుడనెను.

"రాజ్యమునకై అన్నదమ్ములు తగవులాడుట చరిత్రకు క్రొత్తగాదు. ప్రజల శాంతి సౌఖ్యములకై సుఖలాలసుడు, నిరంకుశుడు అగు ప్రభువును, ఆతని జ్ఞాతి దేశము నుండి వెళ్లగొట్టిన విషయము మనకు మహాభారతమున కాన్పించుచున్నది. ప్రజాక్షేమమునకు బాంధవ్య మడ్డు రాకూడదు."

అశోకుడు రధగుప్తుని సలహా ప్రకారము తన సైన్యమును నంతను సమాయత్త పరచి, ముఖ్య నగరముపై నడువ సాగెను.

రాజాజ్ఞతగల సుషిముడు తన తమ్ముడు అశోకుడు ముఖ్య పట్టణముపై సైన్యముతో దండెత్తి వచ్చుచుండెనను వార్త మొట్ట మొదట నమ్మలేక పోయెను. కాని, తన వేగుల వారా వార్తను ధ్రువపరచిరి. అంత నితో తన సంశయము లడిగెను. "ప్రియ సోదరా, సుస్వాగతము. సైన్యమును నగరము వెలుపటనే శిబిరములందు విడిది చేయింపుము. నీవు పట్టణము లోనికి రాగలవాడవు." అని సుషిముడు అశోకునకు వార్త పంపెను.

"నేను పట్టణమును ముట్టడించుటకు వచ్చితిని; కాని, అందు ప్రవేసించుటకు కాదు." అని అశోకుడు ప్రత్యుత్తర మంపెను.

సుషిముని అనుమానం ఇక పూర్తిగ తీరిపోయెను. దాడి నెదుర్కొనుటకు సిద్ధపడెను. గంగానది ఒడ్డున సుషి ముని సైన్యములు అశోకుని సైన్యముతో తలపడెను. రణ భేరులు ప్రమోగింప బడెను.

ఆ యుద్ధమున సుషిముడు చంప బడెను. అశోకుడు మగధ సామ్రాజ్యమునకు చక్రవర్తాయెను.

అశోకునకు పట్టాభిషేక ప్రయత్నములు జరుగు చుండెను. రాజు రాణితో కూడా సింహాసనమును అధిష్టించుట సంప్రదాయము. ఉజ్జయనికి వార్త పంపిరి. అశోకుని ప్రథమ

భార్య శాక్యకుమారీ దేవి తన పిల్లలతో, విదిశా నగరమున తన పుట్టింట నుండెను. ఆమె తన భర్త వ్రాసిన జాబు చూచి "నా తండ్రి వైశ్యుడు. నేను రాజ సింహాసనముపై కూర్చొను అలవాటు లేని దానిని. అదియును గాక, నేను శాక్య వంశమున పుట్టితిని. శాక్యులు సింహాసనమును అధిష్ఠించుట మన స్కరించని పని. సామాన్యులవలె యుండుటకే వారి రివాజు. దయయుంచి, ప్రశాంతమగు నన్ను నా పిల్లలతో నుండుటకు అనుమతించ కోరుచున్నాను." అని సమాధాన మంపెను.

అశోకుడు తక్షశిలకు పోవు మార్గ మధ్యమున, కౌశాంబీ నగరమున మరియొక కన్యను వివాహమాడెను. ఆమె పేరు కారువాకి. ఆమెను తోడ్కొని వచ్చుటకు వార్తాహరులు కౌశాంబికకు వెడలిరి. కారువాకి కురువంశ సంజాత. ఆమెకు కుటుంబ కలహమన్న తగని భయము. తన కురు కులములోనే కుటుంబ కలహము రాజవంశ నిర్మూలనమునకు దారి తీయుట ఆమెకు తెలిసిన విషయము. అశోకుడును కుటుంబ కలహమునకు తలపడెనని తెలిసికొన్నది. అందు వలన, "ఓ మహారాజా! నాకు రాణిగ నుండుటకు తగిన జ్ఞానము లేదు. రాచ కార్యములందుకల చిక్కులు గ్రహించుటకు, చతురతతో తగు సలహాలిచ్చుటకు నేనంత చదువు కొన్న దాననుగాను. కనుక, నా కుమారుడు తీవరుని పరిపూర్ణ మానవునిగ మలచుకొనుటకు, ప్రశాంతముగ జీవ యాత్ర సాగించుటకు అనుగ్రహించ వలసినదని, ఆశీర్వదించ వలసినదని వేడుచున్నాను." అని మహారాజునకు కారువాకి జాబు వ్రాసెను.

శాక్య కుమారీదేవి, -కాపువాకియును మగధ వచ్చుటను నిరాకరించుటచే, సింహాసనాస్థితుడై తిరిగి వివాహము చేసికొనవలసి వచ్చెను. నూతన మహిషి అసంధిమిత్రి మగధ సామ్రాజ్యమునకు రాణి ఆయెను.

అశోకు డాతని ఇరువది నాల్గవ సంవత్సరమున మహా వైభవముగ మగధ సింహాసనమును అధిష్టించెను.

## 2. తిష్యుని రాజ ప్రతినిధిగ నియమించుట

అశోకునకు తిష్యుడను తమ్ముడు కలడు. చిన్నతనము నుండియు ఆతడు కొంటె కోణంగి. తండ్రి మరణముతో కొంత కాలముపాటు బెంగతో విచారముగ నుండెను. క్రమేపి బెంగ తగ్గి మామూలు స్థితికి వచ్చెను. అప్పటి నుండి అతని కొంటె తనముచే, మగధ ప్రజలు అలజడ పడుచుండిరి. రాజసభలో రోజుకొక పితూరి తిష్యునిపై వినుపించుచుండెను.

—“ఓ రాజా! తిష్యుడీ రోజున నా కపకారము చేసెను.”

—“ఓ రాజా! తిష్యుడీ దినమున నన్నిట్లవమానించెను.”

—“ఓ రాజా! తిష్యుడీ పూట నన్నీ రకముగ దూషించెను.”

ఇట్లనుక్షణము పితూరీలు ఎక్కువయ్యెను. దానితో అశోక చక్రవర్తి తీవ్రముగ ఆలోచింప వలసివచ్చెను. అతడు

సింహాసనమునకు వచ్చుచునే ఒక సోదరుని చంపవలసి వచ్చెను. తిరిగి వెంటనే మరొక సోదరుని శిక్షించిన ప్రజలకు తన యందుగల సదభిప్రాయము పోవును. కాని, తాను చక్రవర్తి గుటవల్ల, ఇట్టి దుండగములు ముందు జరుగకుండ జాగ్రత్త తీసికొనవలసి యుండెను. అందుకై మంత్రి మండలితో సంప్రతించెను.

రథగుప్తుడు కడు సూక్ష్మబుద్ధి కలవాడు. తక్షణము అతడొక ఉపాయమును పన్నెను. ప్రధాని ఒకరోజున తిష్యుని దర్బారునకు తీసికొని వెళ్ళెను. అప్పుడు దర్బారు నందెవరును లేరు. "యువరాజా! మీ పెద్దన్నగారు అనారోగ్యవంతులైన, నీవు రాజకార్యముల చక్కబెట్ట గలవా?" అని రథగుప్తుడు తిష్యుని ప్రశ్నించెను.

"చక్క బెట్టలేకేమి?" అని తిష్యుడు జవాబిచ్చెను.

"మంచిది. నీవు సింహాసన మెక్కుదువా?"

"తప్పక. నన్ను చక్రవర్తిగ నియమించినపుడు నేను సింహాసనముపై కూర్చొనవద్దా?"

"మంచిది. మీరు సింహాసనముపై కూర్చొన్న చూడవలెనని కుతూహలముగ నున్నది. కూర్చొనుడు. ఎట్లుందురో చూతును."

"నే నెట్లుంటినో చూడిప్పుడు" అని తిష్య సింహాసనముపై కూర్చొని చెప్పెను.

"సింహాసనమునకు నీ వెంతయు తగియుంటివి. మొట్ట మొదటి రోజున సభికుల నుద్దేసించి, ఏమి చెప్పతలచితివి?" అని గడ్డమంటి బుజ్జగింపుగా రథగుప్త డనెను.

"నీవు నా గురించి ఏమనుకొనుచుంటివి? నేను మాట్లాడ లేననా నీ అభిప్రాయము. ఇక విను. నా ఉపన్యాసము." అని తిష్య ఉపన్యాస మిచ్చుటకు మొదలిడెను. "సభికులారా! మౌర్య వంశపు చక్రవర్తి, తేజోవంతుడు, సర్వగుణ సంపన్నుడగు అశోక చక్రవర్తి ఇప్పు డారోగ్యముగ లేరు. సువిశాలమగు ఈ సామ్రాజ్య భారము నేను వహింపవలసి వచ్చెను. భారమగు ఈ రాజ్య పాలనమున మీరందరు సహకరింతురని ఆసించుచుంటిని. మీ శక్తి, సహకారములందు నాకు విశ్వాసము కలదు."

అని అనుచుండగనే ఇంతలో అశోకు డచ్చటికి వచ్చెను. తిష్యుని అంత్యోపన్యాసమును వినెను. "ఏమిది? నీవు నాపై కుట్ర చేయుచుంటివా! భటు లెక్కడ? తక్షణము వీరిద్దరిని బంధించుడు." అని ముఖము చిట్లించి కోపముతో గట్టిగ అరచెను.

చక్రవర్తి చప్పట్లు చరచెను. పరుగు పరుగున స్త్రీ రక్షకులు వచ్చి, రధగుప్తుని తిష్యుని పట్టుకొని చెరశాలకు తీసికొని వెడలిరి.

రాజమాత సుభద్రాంగికి ఈ వార్త తెలిసిన వెంటనే అశోకుని కడకేగెను. "కుమారా, అశోక, తిష్య నీ తమ్ముడు. ఆతని శిరచ్ఛేదము చేయించకు. ఆతడేమైన పొరబాటు చేసిన దయయుంచి మరచిపొమ్ము. నే నాతనికై ప్రాణభిక్ష వేడుచున్నాను." అని అతిదీన వదనయై వచించెను.

"అమ్మా, భయపడకు. నే నాతని దుండగముల అదుపులో పెట్టవలెను. రాజు తమ్ముడు దుండగములతో కాలము వెళ్ళబుచ్చుచుండిన, రాజ్య వ్యవహారముల పట్టించుకొనువారింకెవ్వరు ? అని చిరునవ్వుతో అశోకుడు తల్లితో వచించెను.

నరకాలయ మను పేర అశోకుడు స్వయముగా కట్టించిన ఖైదొకటి కలదు. దానికి చీకటి కొట్టను ప్రసిద్ధి కలదు. అన్ని విధములగు చిత్రహింసలకు తగు ఏర్పాటులందు గలవు. దాని యందే అశోకుడు తిష్యుని ఏడురోజుల వరకు బంధించెను. ఇంతలో ఆతనికి పిచ్చెత్తు చిహ్నము లగుపించెను. ఏడు రోజుల తరువాత ఆతని రాజ్యసభకు గొని వచ్చిరి. అప్పు డాతని శరీరము శుష్కించి, సుమారుగ మతిచెడి యుండెను. ఆతని ముఖము చూచి, పోల్చుటకుకూడ ఎంతమాత్రము ఆనవాలు దొరకకుండ, ఆతడు మారిపోయెను. "ఓ యువరాజా, నీవిపుడు సరిగ రాచకార్యముల నిర్వర్తించ గలవని తలంచుచుంటిని." అని తిష్యుని చూచి, చిరునవ్వుతో అశోకుడనెను.

తిష్యుడు పగటి వెలుతురును చూడలేకుండెను. ఆ వెలుగున కాతని కండ్లు మిరుమిట్లు గొలుపు చుండెను. వెలుతురు చూడ లేక రెండు చేతులతో కండ్లు మూసుకొనెను. "ఓ రాజా, నీవు నన్నేమి చేయమని శాసించినను, శిరసా వహించి చేయుదును. దయయుంచి నన్నుమాత్రము తిరిగా నరక కూపమునకు పంపవలదు." అని దుఃఖించుచు గద్గద స్వరముతో వేడుకొనెను.

"మంచిది. నిన్ను తక్షశిల రాష్ట్రమునకు రాజ ప్రతినిధిగ నియమించుచుంటిని. ఇకనుండి నీవు తక్షశిలకు ఉపరాజువు." అని అశోకుడనెను.

సభికులందరు చక్రవర్తిని మెచ్చుకొనిరి. ఉత్సాహముతో కరతాళ ధ్వనులు చేసిరి. ఆ మరుసటి రోజుననే తిష్యుడు తక్షశిలకు బయలుదేరి వెడలెను.

అశోకుని అన్నదమ్ములలోకెల్ల చిన్నవాడు వీతాశోకుడు. ఆతనిని కూడా రాజ్యమున నేదైన బాధ్యతగల స్థానమున నుంచుటకు సంకల్పించి, మంత్రి రధగుప్తుని సలహా అడిగెను.

వీతాశోకుని నడవడి మంచిది. చక్కని చిత్రకారుడు; గాయకుడు. రాజ కార్యములం దాతనికి మనసు చొరబడదు. చదువుకొనుటయందు, నూతన విషయముల తెలిసికొనుట యందు అభిలాష మెండు. ఆతడు బౌద్ధుల త్రిపిటకములను క్షుణ్ణముగా అధ్యయనము చేసి యుండెను. మండపములో చదువుకొనుచు ఎల్లపుడు ఇటు నటు తచ్చాడు చుండెడు వాడు. ఇట్లుండ ఒకరోజు ఉదయమున అద్దములో తనను తాను చూచుకొనెను. తన తలవెంట్రుకలు కొన్ని నెరసిన ట్లుండుట గమనించెను. చకితుడై వానిని గూర్చి దీర్ఘముగ ఆలోచించ మొదలిడెను. వయస్సును తెలియట కిది యొక చిహ్నము. వృద్ధాప్యమను ఛాయ తెలియకుండగనే కబళించి వేయును. చావు పిమ్మట సద్గతి బడయుటకు, అప్పటి కప్పుడు సిద్ధ పడుటకు వ్యవదుండదను ఆలోచనలో వీతాశోకుడు మునిగి తేలుచు నిదురకూడ పోవుటలేదు. తానొకటి తలచు

చుండ, చక్రవర్తి వేరొకటి తలంచుచుండెను. ఒక రోజున చక్రవర్తి వీతాశోకుని రాజసభకు రావించి, "నీవేదైన రాజ కార్యములందు నియుక్తుడ వగుట నా అభిమతము." అని వచించెను.

"ఓ రాజా, నన్ను మన్నించుము. రాజకార్య నిర్వ హణమందు నే నెవరిని క్రూరముగ శిక్షించలేను. ఇతరుల బాధించుట నాకు హితవులేదు. ఈ ప్రపంచము అశాశ్వతము. కాన, సన్యసించుటకు నిర్ణయించుకొంటిని. సత్య పథమును జేరునట్లు ఆశీర్వదించవలసినదిగ తమను కోరుచుంటిని." అని వీతాశోకుడు చక్రవర్తికి విన్నవించెను.

వీతాశోకుడు రాజ్యసభనుండి తిన్నగ పాటలీ పుత్ర మందు ప్రసిద్ధ భిక్షువగు గిరిదత్తునివద్ద కేగెను. "ఓ బుద్ధ భిక్షూ, తమవద్ద సంఘదీక్ష నొంద దలచితిని. నాయందు దయయుంచి, దీక్షాస్వీకార మొప్పించవలసినది" అని యాతనిని వేడెను.

నాటి నుండి వీతాశోకుడు బౌద్ధ భిక్షువు.

## 3. కళింగ యుద్ధము

అశోక చక్రవర్తి సోదరుల సమస్యను చక్కబరచి, సామ్రాజ్య విస్తరణను గూర్చి యోచింపసాగెను.

కళింగ రాజ్యమును జయించు టాతని మొదటి తలంపు. కళింగ రాజ్యము మహానదికి దక్షిణ తీరమునుండి తూర్పుగా సముద్రము వరకు వ్యాపించి యుండెను. అది

చాల బలమగు రాజ్యము. కళింగ రాజ్యమందు అరువది వేల కాల్బలము, ఒకవెయ్యి అశ్వదళము, ఏడువందలు యుద్ధ గజములు ఎల్లపుడు పరరాజుల దండయాత్రలను ఎదుర్కొనుటకు సిద్ధముగ నుంచబడెను. అంత శక్తిగల రాజ్యమును సరిహద్దులో నుండనిచ్చుట క్షేమము కాదని తలంచెను. కళింగ రాజ్యముపై దండెత్తెను. వేలాది మగధ సైనికులు మహానదిని దాటి కళింగ రాజ్యమును ముట్టడించిరి.

యుద్ధ తంత్రమున మగధ సైనికులు అతి నిపుణులు. కళింగ సైనికులు వారి ధాటికి నిలువలేక పోయిరి. వేలాది సైనికులు హతులైరి. వేలాది వికలాంగులైరి. వారి రక్తముతో రణభూమి దొప్పదోగినది. కళింగ మోడిపోయెను. మగధ విజయమును వరించెను.

అశోకుడు విజయోత్సాహముతో, పట్టపు ఏనుగుపై యుద్ధ భూమిగుండా వెడలెను. ఇరువైపుల వందలాది సైనికులు చచ్చి పడియుండిరి. అందు కొందరికి చేతులు లేవు; కొందరు కాళ్లు పోగొట్టుకొనిరి. మరి కొందరు బల్లెములతో గ్రుచ్చబడి యుండిరి. కొన్ని మొండెములకు తలలేలేవు. చావగా మిగిలినవారు బాధచే గిజ గిజ లాడుచు, మూలుగుచుండిరి. అశోకుడు చాల యుద్ధముల గూర్చి వినియుండెను. కాని, దృష్టి పారునంతవరకు ఎటు చూచిన పీనుగు పెంటలతోను, గాయములచే బాధనొందుచు, కుప్పలు కుప్పలుగ పరచినట్లు పడియున్న సైనికులతోను కూడిన అట్టి దృశ్యమును మున్నే యుద్ధమున కని విని యెరుగడు. ఆ దృశ్యమును

చూచిన తరువాత, రథగుప్తునితో, "చావగా మిగిలిన వారిని మనము రక్షించవలెను" అని అశోకుడనెను.

"మహారాజా! మనము తప్పక రక్షించ వలసినదే. కాని, ఇంత మందిని కాపాడుటకు తగు ఏర్పాటు లేమియు మనవద్ద లేవు. మనకు చాలా ఔషధములు, పరిచారకులు కావలసి యుండును" అని రథగుప్తుడు సమాధాన మిచ్చెను.

"అట్లయిన వీరందరు దిక్కులేని స్థితిలో ఇచ్చట మరణించ వలసినదేనా?"

"మహారాజా, అటుల జరుగదు. ఇందందరు చనిపోరు. కొందరిని వారి బంధువులు వెతకి తీసికొనిపోయి సంరక్షింతురు."

"బాధామయమగు నీ మూలుగుల నే విజాలను."

"ప్రతి యుద్ధ పర్యవసానము ఇంతే. మీ తాత చంద్రగుప్తుడు అనేక రాజ్యముల జయించెను. ప్రతి యుద్ధమందు ఆతడిట్టి దృశ్యముల గుండా వెడలి, పర రాజ్యముల స్వాధీన పరచుకొనెను."

చక్రవర్తి దారి పొడుగున వికలాంగులై బాధచే మూలుగుచు పడియున్న సైనికుల చూచి, విచారముతో సమాధి నొందిన వానివలె సాగుచుండెను.

ససైన్యముగా చక్రవర్తి యుద్ధభూమిని గడచి, కళింగ రాజధానిలో ప్రవేశించెను. అప్పటికి సంధ్యాసమయ మగుచుండెను. నగర మంతయు దుఃఖమయమై మాటు మడగినట్లు నిశ్శబ్దముగ నుండెను.

మరునాడుదయముననే చక్రవర్తి దర్బారు తీర్చెను. అశోక చక్రవర్తి విజయ చిహ్నముగ బాకాలూది, విజయ భేరీలు మ్రోగించ బడెను. "మౌర్య సింహుడు, మగధ సామ్రాట్టు, సర్వ సద్గుణ సంయుతుడు, సర్వశక్తి సంపన్నుడైన అశోక చక్రవర్తి ఆసేతు హిమాచల పర్యంతము పరివ్యాప్తమైన మగధ సామ్రాజ్యములో కళింగ రాజ్యమును కలుపుకొనెను. రాజాధిరాజైన మన చక్రవర్తి దీర్ఘాయుష్మంతుడై వర్థిల్లుగాక" అని ప్రకటనకారి వెల్లడి చేసెను.

సభ రాజ్య వ్యవహారము లారంభించుటకు ముందు, ఒక యువభిక్షు సభలో ప్రవేసించి, "చక్రవర్తి దీర్ఘాయుష్మంతుడగుగాక !" అని ఆశీర్వదించెను.

"ఓ భిక్షూ, మీ కోర్కేమి ?" అని చక్రవర్తడిగెను.

"ఓ రాజా ! నేను యుద్ధభూమినుండి వచ్చుచుంటిని. యుద్ధమందు మరణించిన వారెందరో, వికలాంగులై గాయములతో బాధపడుచున్న వారెందరో లెక్కించి వచ్చితిని. లక్షమంది చనిపోయిరి. లక్షా ఏబదివేల మంది ప్రమాదమగు గాయములచే బాధ పడుచుండిరి. అందులగూర్చి మిమ్మొక ప్రశ్న వేయవచ్చితిని. మీరిందొక్కనినైనను వాని బాధనుండి తప్పించ లేనపుడు, ఇంతమందిని గాయములతో బాధించుటకు మీకుగల హక్కేమి ? ఈ రెండు లక్షల ఏబదివేల మంది బంధువులు వారి దురదృష్టమునకు విచారించుచుండ, ధర్మరాజ్య సంస్థాపన నిమిత్త మిచ్చట కొలువు తీర్చుచుంటి

ననుచుంటివి. ఎందుకీ దొంగసటన? ఏల ఈ ఆత్మవంచన?" అని ప్రశ్నించెను.

అశోకుని కళ్లు జేగురించెను. సభికులు భయమందిరి. "ఓ భిక్షూ, జాగ్రత్త; నీ వెవరితో మాట్లాడుచుంటివో తెలుసుకు మాట్లాడుము" అని రధగుప్తుడు హెచ్చరించెను.

కాని, భిక్షు చలించలేదు. "ప్రధానామాత్యులు దీర్ఘాయుష్మంతు లగుదురుగాక! ఓ ప్రధాని, నీవు మరచితివి. సత్య మెవరిని గౌరవింపదు. నాకేది అధర్మమో, చక్రవర్తికి గూడ అదే అధర్మము. నేను భిక్షును. ధర్మబోధ చేయుటే భిక్షు ధర్మము" అని తెల్పెను

"నీవు చాల కుర్రవాడవు. నీవు మాట్లాడు మాటల వలన నీకొచ్చు ముప్పును నీవు గ్రహించలేకున్నావు. నిన్ను హెచ్చరించుచుంటిని. శ్రుతి మించకమునుపే నిన్ను నీవు సరి దిద్దుకొమ్ము" అని భిక్షుని రధగుప్తుడు మందలించెను.

నేనొక భిక్షువును. సత్యారాధకుడను. నిజమాడుట అపరాధమైన, నే నపరాధిని. అట్లైన నాకెట్టి శిక్ష విధించినను అనుభవించుటకు సిద్ధముగ నుంటిని" అని భిక్షు జవాబిచ్చెను.

అశోకుడిక ఎంతమాత్రము సంహించజాలక పోయెను. "భటులెక్కడ? ఈ వాచాలుని తీసికొని వెడలి నరకాలయపు చీకటి కొట్టులో బంధింపుడు" అని మేఘమువలె గర్జించెను.

భిక్షువు చిరునవ్వు నవ్వెను ధర్మమును బెదరింపులతో అణచలేవు. నీవు నన్నెంతకాలము చెరలో నుంచగలవు? జీవితము క్షణభంగురము. అశాశ్వతమగు ఈ ప్రపంచములో

నీవుగాని, నేనుగాని ఉట్టికట్టుకు ఊరేగలేము. కాని, ధర్మ మెల్లకాలము నిల్చియుండును."

ఎంతసాహసము! అంత నిర్భయముగ చక్రవర్తి ఎదుట ఎటుల మాట్లాడెను! అశోకుడు తన ఆజ్ఞను మార్చెను. "అహంకారియగు ఈ భిక్షువును సలసల కాగు చమురులో వేపుడ"ని శాసించెను.

మరల భిక్షువు బిగ్గరగా నవ్వెను "చక్రవర్తి దీర్ఘాయుష్మంతుడగుగాక !" అని నెమ్మదిగా ఆశీర్వదించెను.

భటులా భిక్షువును బైటకు గొనిపోయిరి. చీకటివలె, నిరుత్సాహ మా సభనంతను ఆవరించెను. యుద్ధమందు ప్రత్యేక నైపుణ్యము చూపిన సరదారులకు చక్రవర్తి బహుమతులిచ్చి, సభ చాలించెను.

## 4. బౌద్ధమత స్వీకారము

మధ్యాహ్నమాయెను. రాజు రధగుప్తునితో రాజ్య వ్యవహారములు సమాలోచన చేయుచుండెను. అంతలో భటు డొకడు పరుగెత్తుచు వచ్చెను. "ప్రభూ, అంతయు వింతగా నున్నది. కాగుచున్న చమురులో భిక్షువునుపడ ద్రోసితిమి. కాని, భిక్షువునకు చుఱుకైన లేదు." అని విన్నవించెను.

"ఏమంటివి !"

"అవును, మహారాజా, చెప్పినది నిజము. మే మెప్పుడు అట్టి దృశ్యమును చూడలేదు.

"మంచిది; మహాప్రభూ! మనమే వెడలి స్వయముగ ఆ విషయమును తెలిసికొందము." అని రధగుప్తు డనెను.

చక్రవర్తి బయలుదేరెను. అంగరక్షకులు బారులుతీరి జాగరూకులై వెంబడించిరి. అశోకుడిట్లు గుడారముల దాటి, 'మసహా' యను భిక్షుని శిక్షించుచున్న ప్రదేశమునకు వెడలెను. గుమిగూడిన ప్రజలు వైదొలగి చక్రవర్తికి దారిచ్చిరి. అశోకు డంత ముందునకు వెడలెను.

బహిరంగ స్థలమున తాత్కాలికముగ ఇటుకలతో నొక పొయ్యి కట్టిరి. దానిపై నూనెతో ఒక మండిగ నుంచిరి. పొయ్యి మండినది. నూనె మరగినది. ఆ మరుగు నూనెపై భిక్షువు యోగాసనస్థుడై కూర్చొని యుండెను. కాని, మంట శగకూడ ఆతనికి సోకుటలేదు.

చక్రవర్తి తనకండ్లను తానే నమ్మలేకుండెను. వెంటనే పొయ్యార్పించెను. భిక్షుని భటులా పాత్రనుండి దింపిరి. చక్రవర్తి చేతులు కట్టుకొని, ఆతనిముందు మోకరించి, "ఓ భిక్షూ, ఈ దీనుని మన్నింపుడు. మీయెడ తీరని అపచారము చేసితిని." అని వేడుకొనెను.

భిక్షు కండ్లు తెరచి, బాలునివలె చిరునవ్వు నవ్వుచు, "నిన్ను నీవే అవమానపరచుకొంటివి. ఓ రాజా, నీ శక్తిపై నీ కెక్కువ విశ్వాసము కలదు. అందుచే నిన్ను నీవే మరచితివి. నీవు డంబముగ చెప్పుకొను శక్తి, వట్టి పశుశక్తి కాని

మరొకటికాదు. అట్టి పశుశక్తి నైతికశక్తిని జయింపజాలదు. అనేక రాజ్యములు వెలసినవి, కూలినవి. ఎందరో సేనానులు ఎన్నియో రాజ్యముల జయించిరి. అందెందరు స్థిరముగ నున్నారు? ఇందులో మన కెందరిపేర్లు జ్ఞాపకమున్నవి? 'కారేరాజులు, రాజ్యముల్ గలుగవే, గర్వోన్నతిం జెందరే! వారేరీ? ఉర్విపై పేరైనం గలదే?' కాన, పశుబలమువలె నైతికబలము నశ్వరముకాదు. నేటికిని మనమందరము పార్శ్వనాథ, మహావీర, బుద్ధాదులు మానవ హృదయముల నెట్లు వశపరచుకొనిరి? వారి సందేశములు తరతరముల, యుగయుగముల ఎటు లాచరించుచున్నారు! ఓ రాజా, అదే విధమున నీవుకూడ ప్రజాహృదయముల చూరగొనగలవు. చక్రవర్తను పదమునకు సరియగు అర్థము నీవే అనునట్లుండ గలవు. ధన్యుడవు కమ్ము" అని వివరించెను.

అశోకుడు ఆ భిక్షువును ఉచిత గౌరవములతో తన శిబిరమునకు గొనిపోయెను. ఆ భిక్షువుతో రాత్రింబగళ్ళు మత ధర్మముల గూర్చి చర్చించెను. ఆతనితో చర్చించిన కొలది, ఆలించినకొలది అశోకుడు ముగ్ధుడగుచుండెను. తుట్ట తుదకు చక్రవర్తి, "ఓ భిక్షూ! నేను మిమ్ము శరణు వేడు చుంటి"నని వచించెను.

అంత ఉపగుప్తుడు అశోకునకు ఇట్లు ఉపదేసించెను.

"బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

బుద్ధుడే నాకు శరణ్యము.
ధర్మమే నాకు శరణ్యము.
సంఘమే నాకు శరణ్యము.

ఆ దండయాత్రకు పర్యవసానమిది. అశోకుని యుద్ధ యత్నముల కదే ముగింపు. ఉపగుప్తుని అనుసరించుచు అశోక చక్రవర్తి బౌద్ధ క్షేత్రముల యాత్ర సల్పెను.

## 5. ఉపగుప్తుడు

ఉపగుప్త భిక్షు మధురవాసి. ఆతడు మొగ్గలి యను కాశీవర్తకుని కుమారుడు. బుద్ధుని శిష్యపరంపరలో ఆరవ తరమువాడు. ఇది శిష్యపరంపర — ఉపాలి, దశాకుడు, శోనకుడు, సిగ్గోవుడు, చందవృజియుడు, ఉపగుప్తులు. ఉపగుప్తుడు బౌద్ధ సంఘమున చాల బాల్యముననే ప్రవేశించెను. ఆతడు సర్వశాస్త్రములు చదివెను. ప్రతి సూత్రమును వివరముగ తెలిసికొనెను. యోగాభ్యాసమును చేసి అసాధారణ మూర్తిమత్త్వమును బడసెను. ఆతని ప్రతిభ లోకప్రసిద్ధి గాంచెను. భిక్షులోకమున కాతడు గౌరవపాత్రుడు. ఉత్తర భారతమున బౌద్ధ ధర్మచక్రములో అనగా బౌద్ధసమాజములో అగ్రగణ్యుడు.

"ఆరోగ్య పరమలాభ, సంతుష్ఠి పరమం ధనం
విశ్వాస పరమజ్ఞాతి, నిర్వాణ పరమం సుఖం"
—ధర్మపదము.

అన్ని లాభములందు ఆరోగ్య ముత్తమ లాభము;
ప్రాపంచిక ఐశ్వర్యములలోకెల్ల సంతుష్టి ఉత్త
మైశ్వర్యము.
విశ్వాస ముత్తమ మిత్రము.

సుఖము లన్నిటిలోను నిర్వాణము పరమ సుఖము.
—అని బౌద్ధ ముఖ్య ధర్మములలో ఒక ధర్మము వివరించు చున్నది.

ఉపగుప్తుడు పైన వివరించిన బౌద్ధ ధర్మమును ఆచరణలో పెట్ట తలంచెను. అశోకునకు హృదయ పరివర్తన కలిగించి, రక్తపాతము నరికట్టుటకు కళింగ దేశము బయలు దేరెను. యుద్ధము ఆరంభము కాకుండగనే కళింగము జేర వలసి యుండెను. కాని, దారిలో ఆలస్యమాయెను. ఆతడు మధురా నగరము ప్రక్కగ కళింగకు పోవుచుండ, ఒక స్త్రీ మార్గమధ్యమున ఏడ్చుచు పడియుండెను. ఆమె మశూచిక ముతో అమితముగ బాధ నొందుచుండెను. తమకు కూడ మశూచికము వచ్చునేమో యను భయముతో ఆమె బంధువు లామె నచ్చట ఒంటరిగ వదిలివేసిరి. ఆమె కెవరును దిక్కులేరు. ఉపగుప్తుడు సన్యాసి. ఆ వ్యాధి తనను అంటునను భయము లేదు. "మానవసేవయే పరమావధి" అని ఆతని మతము. అందుచే ఆత డచ్చట ఆమెకు సంరక్షణచేసి, కాపాడెను. ఇంతలో అశోకుడు కళింగదేశముపై దండెత్తుట, పోరుట, జయించుట అంతయు జరిగిపోయెను.



# 6. తీర్థయాత్ర

అశోకుడు బౌద్ధమతమును స్వీకరించిన వెంటనే ఉపగుప్తుని వెనుక తీర్థయాత్రకు బయలుదేరెను. వారిరువురు పట్టపేనుగుపై ప్రయాణమైరి. వారిరువురకు రాజచ్ఛత్రము నీడ నిచ్చుచున్నది. అందొకరు కటికి కాషాయమును ధరించిన భిక్షువు. మరొకరు చీనిచీనాంబరములతో అలంకృతుడైన చక్రవర్తి. రక్షక భటులు, సైనికులు, ఉద్యోగులు, ఊరేగింపుగా వెంటనంటిరి.

బౌద్ధ క్షేత్రములగు లుంబినీవనము, కపిలవాస్తు, బుద్ధగయ, సారనాథము, శ్రావస్తి, కుశీనగరముల చక్రవర్తి దర్శించెను. లుంబినీవనము బుద్ధభగవానుని జన్మస్థలము. అశోకు డచ్చట ఒక శిలా స్తంభము నెత్తించెను. అందమగు గుఱ్ఱపు విగ్రహ మొకటి ఆ స్తంభము పైభాగమున నలంకరింపజేసి, ఆ స్తంభముపై బుద్ధ భగవానుని జీవితగాథ చెక్కించెను.

నేటి మన దేశపటమందు మనమా లుంబినీవనమను పేరును చూడలేము. ఆ పేరు క్రమేపి కాలగర్భమున కలయుటచే ప్రజలు మరచిపోయిరి. ఆ ప్రదేశము ప్రస్తుతమున 'దుల్హా' జిల్లా పటమందు 'రుబిన్డై' అను పేర గాంచగలము.

అశోకు డచటినుండి తరలి కపిలవాస్తు జేరెను. బుద్ధుని బాల్యము అక్కడనే గడచినది. అచటనే గౌతముడు మర

ణము, రోగము, బాధ, వార్థక్యముల చూచి రాజభోగములు త్యజించి, సింహాసనమును కదలి భిక్షువయ్యెను. ఆ స్థల పవిత్రతకు స్మారకార్థముగ అశోకుడు స్తూపమును నిర్మించి, శిలాస్తంభమును నెలకొల్పెను.

అనంతర మాతడు బుద్ధగయ దర్శించెను. అచ్చట నైరంజన నది కట్టపై బోధి వృక్షము కలదు. ఆ వృక్షపు నీడనే బుద్ధు డారుసంవత్సరములు ధ్యానమగ్నుడాయెను. మానవ కళ్యాణము కొరకు రెండువేల నూటతొంబది రోజులు సర్వ శక్తులు కేంద్రీకరించి తదేక దీక్షతో కఠిన తపస్సు చేసిన తరువాత నాతనికి జ్ఞానోదయ మయ్యెను. ఆరోజునుండియు గౌతముడు తథాగతుడాయెను. అశోకుడా బోధి వృక్షము చుట్టును చమను చేయించి, రాతిపరుపు కట్టించెను.

ఆ చక్రవర్తి అటనుండి కాశీక్షేత్రమునకు ఏడెనిమిది మైళ్ళ దూరమున గల సారనాథమునకు జేరెను. ఆరోజులలో ఆ ప్రదేశమును ఇసి పట్టణము అని పిలిచెడివారు. బుద్ధభగవానుడు జ్ఞానోదయమైన తరువాత, మొట్టమొదట ఈ ఇసి పట్టణముననే ధర్మబోధ చేసెను. తరువాత ఈ ఉపన్యాసమునే బౌద్ధమత మూల సూత్రములుగ పరిగణించిరి. అచ్చటకూడ అశోకుడొక స్తూపమును నిర్మించి, శిలాస్తంభము నెత్తించెను. ఆ స్తంభముపై బౌద్ధసంఘములు, రాజకీయోద్యోగులు పాటించవలసిన సూత్రముల చెక్కించెను. ఆ స్తంభాగ్రమున నాల్గు తలలుగల సింహమును చెక్కించెను. ఈ చిహ్నమునే నేటి మన స్వతంత్ర భారతమునకు రాజముద్రగ స్వీకరించిరి.

అచ్చటినుండి అశోకుడు శ్రావస్తి చేరెను. బుద్ధుడిచ్చట చాలకాలము గడపెను. ఇచ్చటినుండియే బుద్ధుని సందేశము యావద్భారతదేశము వ్యాపించెను. బుద్ధుని మొట్టమొదటి శిష్యులగు ఆనందుడు, సారిపుత్రుడు, మౌద్గల్యాయనుడు బౌద్ధమత ప్రచారము చేసి, ఇచ్చటనే గతించిరి. ప్రఖ్యాతిగాంచిన జేతవన విహారము ఇచ్చటనే కలదు. ఈ విహారము చుట్టు అశోకుడు ఆరు స్తంభము లెత్తించెను. ఆ స్తంభములకు వృషభ విగ్రహములు తలకట్టుగా చెక్కించెను.

చక్రవర్తి తన యాత్ర ముగించుటకు కుశీనగరము వచ్చెను. బుద్ధభగవానుడు నిర్యాణము నొందినదా స్థలముననే. ఇక్కడకూడ అశోకుడొక స్తంభమును నిల్పెను. ఆ స్తంభ మిప్పటికిని లభింపలేదు.

ఇంత సుదీర్ఘమగు తీర్థయాత్రకు అశోకు డలసట చెందెను. ఈ యాత్రలో ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు వెడలునపుడు మార్గమధ్యమున తగిలిన పల్లెలందు, పట్టణములందు, నదీ తీరములందు, కొండకోపులందు అనేక స్తంభముల నిల్పెను. నేటి చరిత్ర పరిశోధకులు అందు పది స్తంభముల మాత్రమే కనుగొనిరి. అవి కౌసంబి, లౌరియ్య, నందనగడము, లౌరియ అరరాజము, రాంపురియ, సాంచి, తోప్రి, రుమిన్దై, నిగలిబ్ ప్రాంతముల దొరకెను. అందు కొన్నిటిపై శాసనములు కలవు; కొన్నిటిపై ఏమియును లేదు.

సారనాథములో అశోక స్తంభము ఒకటి కలదు. అది ఆకుపచ్చ రాయితో తయారు చేయబడి, అద్దమువలె నును

పుగానుండి, నీడానుచుండెను. కాశీవాసులు దానిని "లాట భైరవుడు" అని పిలుచుచుందురు. 1908వ సంవత్సరమున జరిగిన మత కలహములో దుండగులు ఆ స్తంభమును ముక్కలు ముక్కలుగ పగుల గొట్టిరి.

సామాన్యముగ అశోక స్తంభములు భూమట్టమునకు ముప్పది నలుబది అడుగుల ఎత్తుగను, తొమ్మిది పదడుగుల లోతుగను యున్నవి. ప్రతి స్తంభము పెద్ద ఏకరాతితో తయారు చేయబడెను. ఈ స్తంభములు రెండువేల సంవత్సరములకు పూర్వము తయారు చేయబడినవి. పేరుగాంచిన నేటి పాశ్చాత్య శిల్పులు, రాతికి అట్లు మెరుగు పెట్టుట ఒక ప్రత్యేక కళయని, అది మనకు తెలియదను అభిప్రాయములో నున్నారు. నేటి శిల్పులకన్న పూర్వం హైందవ శిల్పులే ఎక్కువ సామర్థ్యము, కౌశలము కలవారు.

ప్రతి స్తంభశిఖరము ఏనుగు, ఆవు, గుఱ్ఱము, సింహములలో ఏదియో యొకదాని చిహ్నముచే అలంకరింపబడెను. చరిత్ర పరిశోధకులు ఈ నాల్గు గుర్తులు బుద్ధభగవానుని జీవితములోని నాల్గు సంఘటనలను తెలియజేయుచున్నవని వివరించిరి. బుద్ధుడు జన్మించుటకు ముందాతని తల్లి మాయాదేవి వెల్లేనుగును కలలోగాంచెను. కనుక, బుద్ధ జననమునకు బదులుగ ఏనుగు చిహ్నమును స్వీకరించి యుండవచ్చును. కపిలవాస్తు నగరమునకు పురాణములందు వివరించిన కపిల అను గోవును బట్టి ఆ పేరొచ్చి యుండవచ్చును. ఆ పట్టణమును జ్ఞప్తికి దెచ్చుటకు ఆవు గుర్తును గైకొని

యుండవచ్చును. సత్యాన్వేషణ నిమిత్తము గౌతముడు తన రాజ్యమును పరిత్యజించు సమయమున అశ్వము నెక్కి రాజ్యమును దాటెను. వైరాగ్య చిహ్నముగ గుఱ్ఱమును గుర్తుగ గ్రహించి యుండవచ్చును. బుద్ధుడు శాక్యవంశీయుడు. శాక్యసింహుడని పేరుగాంచెను. శాక్యవంశ సింహము గాన, సింహమాతని వ్యక్తిత్వమును వెల్లడిచేయును. ఈ నాల్గు చిహ్నములు తప్ప మరే ఇతరగుర్తులు అశోక స్తంభములందు కనుగొనబడ లేదు.

ప్రతియొక స్తంభము ఏకశిలా నిర్మితములు. ఒక్కొక్కటి ఏబదిటన్నులు అనగా పదమూడు వందల మణుగులకు తక్కువ బరువుండదు. ఇంత బరువగు పెద్ద స్తంభముల పర్వతముల నుండెటుల తీసిరో, వందలాది మైళ్ళదూరము పగుల కుండ ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకెట్లు తరల్చిరో, నేటికిని ఊహించలేకున్నాము. ఆ రోజులలో ఇంతటి బరువగు వస్తువుల నెత్తిదించు ఆధునిక సాధనములు లేవుకదా! అశోకుని అనంతరము పదిహేను శతాబ్దములకు ఢిల్లీ చక్రవర్తి ఫిరోజిషాతుగ్లక్ అశోకుని 'తోప్ర' స్తంభమును మీరట్ నుండి ఢిల్లీకి చేర్చెను. అది చేర్చుటకు కాతడు ప్రత్యేకించి నలుబది రెండు చక్రములతో ఒక బండిని తయారు చేయించెను ప్రతి చక్రమున కొక్కొక్క పగ్గము కట్టబడెను. ఒక్కొక్క పగ్గమును లాగుటకు రెండువందలమంది మనుష్యుల నియమించెను. మీరట్‌నుండి ఢిల్లీకి దూరము నూటిరువది మైళ్లు. అయినప్పటికి ఆ స్తంభమును ఢిల్లీ చేర్చుటకు ఎనుబదినాల్గువేల మంది మనుష్యులు లాగవలసి వచ్చెను.

ఆ నాటి ఒక స్తంభమును ఒక యూరినుండి మరియొక యూరుప జేర్చుట కంత శ్రమపడిరి. ఇటు నటు వేలాది మైళ్ళు వ్యాపించి యున్న భారత దేశమంతయు, అశోకుడు, ఆతని శిల్పులు ఈ స్తంభముల నెటుల జేర్చి నిలబెట్టించిరో నేటికిని ఊహ కందుటలేదు. దీనినిబట్టి ఆనాటి పనివారెంతటి సామర్థ్యము కలవారో తెలియుచున్నది.

అశోకు ననంతరము ఎనిమిది శతాబ్దములకు హుయన్ త్సాంగ్ అను చైనా యాత్రికుడు బౌద్ధ క్షేత్రముల దర్శించుటకు భారత దేశము వచ్చెను. ఆతడు తన యాత్రాసందర్భమున చూచిన విశేషముల గూర్చి ఒక గ్రంథమును వ్రాసెను. భారతదేశ మంతటను అనగా ఉత్తరమున కాశ్మీరు, ఆఫ్ఘనిస్థానము, కాఫీరు స్థానము, ముల్తాను, దక్షిణమున ద్రవిడ, కాంచీ ప్రాంతముల; కళింగమునకు పడమరగ నున్న సింధు, మహారాష్ట్రములందు; తూర్పున కర్ణసువర్ణ, తామ్రలిప్తి ప్రాంతముల నాతడు అశోక స్తంభముల చూచినట్లు తన గ్రంథమున వివరించెను.

అశోకుడు పలు స్థూపముల గూడ నిర్మించెను. భారత దేశమందనేక ప్రాంతముల బుద్ధుని, ఆతని శిష్యుల అవశేషములను అనేక విహారములందు పదిల పరచబడెను. వాటిపై అశోకుడు అనేక స్థూపముల నిర్మించెను. అట్టివి ఎనుబది నిర్మించినట్లు బౌద్ధ రచనలవల్ల తెలియుచున్నది. కాని సాంచి, బార్‌హాత్, పిప్రద్రాలందుగల మూడు స్థూపములు మాత్రమే కను

గొనిరి. మిగిలిన డెబ్బది ఏడు కనుగొనవలసి యున్నవి. ఆ స్థూపములు పరదేశీయుల దండయాత్రలవల్లగాని, కాలక్రమమున ప్రకృతి సంఘటనలవల్లగాని, నశించియుండవచ్చును.

## 7 బౌద్ధమత ప్రచారము

అశోకుడు తీర్థయాత్రా సందర్భమున హిమాలయములకు గూడ వెడలెను. నేపాళ దేశమందలి పర్వత పంక్తులందలి సౌందర్యమును చూచి తన్మయుడయ్యెను. ఆతని కుమార్తె చారుమతి ఆ ప్రాంతము బగాంచి, మంత్రముగ్ధురాలై, "తండ్రీ, నాకీ పర్వతసీమ విడచుటకు మనస్సొప్పకున్నది. జీవిత ఝంఝూటములు ఇటు జేరవు. ఈ ప్రకృతి సౌందర్యమునకు నిర్వాణ ప్రశాంతిని ప్రత్యక్షముగ అనుభవించు చున్నట్లున్నది. ఇక్కడొక విహారమును నిర్మింపుడు. నేనిందే వసించెద"నని తన అభిలాషను వ్యక్తపరచెను.

ఆమె కోర్కె నెరవేర్పబడెను. విహారము నిర్మింపబడెను. చారుమతి భర్త దేవపాలునితో అచటనే నివసింపసాగెను. దేవపాలుడు భిక్షు సంఘమును, చారుమతి భిక్షుణీ సంఘమును నిర్మించిరి. ఆ రెండు సంఘారామముల చుట్టును జనపదము వెలసెను. అది దేవపాలుని పేరిట దేవపట్టణమని పిలువబడజొచ్చినది.

మంచుపేరిన ఎత్తైన శిఖరములు, ఎర్రని కుంకుమ పూవుచే కప్పబడిన నీల సరోవరములతో నిండియున్న హిమా

లయ సౌందర్యమునకు అశోకుడు సమ్మోహితుడయ్యెను. బౌద్ధ భిక్షువులు వసించుటకు ఆ మనోహర సరోవరముల చుట్టును ఐదువందల సంఘారామముల నిర్మించెను. వందలాది బౌద్ధ భిక్షు లు ఆ సంఘారామములందు నివసించుటకు వెళ్లిరి. సహజ సౌందర్యముగల ఆ సుందర పట్టణమునకు శ్రీనగరమని పేరు పెట్టెను.

అశోకుడు బౌద్ధమత సిద్ధాంతముల ప్రచారముచేయ తలంచెను. సామాన్య ప్రజలు కూడ చదివి అర్థముచేసికొని, ఆచరించి అనుభవములోనికి తెచ్చుకొనుటకు వీలుగ బౌద్ధ ముఖ్య సూత్రముల నాతడు శిలలపై చెక్కించెను. ఆ శిలా శాసనము లుత్తరమున సహబజ్‌గరి, మన్‌సేరా ప్రాంతముల; మధ్యభారతమున భాబ్రూ, రూపనాధ, సహస్రములందు; పశ్చిమమున గిరినార, సుపార ప్రాంతముల; తూర్పున ధౌళి, జౌగడములందు బయలు పడెను. ఆ శిలాఫలకములపై చెక్కిన శాసనములు ఇప్పటికిని స్పష్టముగను, స్వచ్ఛముగను యున్నవి. ఆ శాసనముల బట్టి అశోకు డేమిచేయ తలపెట్టె నది తెలిసికొన వీలు కలిగెను.

"జంతుహింస నిషేధింపబడెను."

"ప్రజా కళ్యాణమునకు ఎద్దుల పందెములు, కోడిపందెములు, నాట్య సంగీతములు, నాటకములు నిషేధింపబడెను."

"పశుపక్షుల వేటాడరాదని శాసించెను. పశువులను చంపి, మాంసాహారులై యుండుట ధర్మమునకపచారము. అందువల్ల, ఈ దిగువ పేర్కొనిన జంతువుల చంపరాదని

తెలియజేయుచున్నాను. చీమ, చేప, చిలుక, బాతు, గబ్బిలము, కొంగ, పావురము, ఏదుపంది, అడవిపంది, ఉడుత, మేక, గొఱ్ఱె, దుప్పి, ఎద్దు, ఖడ్గమృగము. పై జెప్పిన జంతువులు ప్రాణముల తోనే మాడిపోవునుగాన అరణ్య దహనము నిషేధించెను.

"తల్లి దండ్రుల పూజింపుము. భూతదయ గలిగి యుండుము. సత్యము వచింపుము."

"అసూయ, అసహనము, క్రూరత్వము, సోమరి తనము ప్రయోజనకారిగావు. మితిమీరి కూడబెట్టుట, మితిమీరి వ్యయపరచుట అపచారము,"

"ముదుసలుల, మతి చెడినవారల సంతానవంతుల నేరముల దయతో పరిశీలింపుము."

"పరమతముల ఖండించినంత మాత్రమున నీ మతమున కాధిక్యము చేకూరదు. మంచి ధర్మములే అన్ని మతములకు ఆధారము. కనుక పరధర్మముల కూడ వినవలయును. తెలిసి కొనవలయును."

"ఈ ధర్మము లాచరించువారు ఇహ పరములందు సౌఖ్యము వడయుదురు."

అశోకుడు మంత్రి మండలిలో ధర్మ ప్రచారకుల కూడ నియమించెను. ధర్మమును ప్రజలు ఆచరించునట్లు చూచుట వీరి విధి. భిక్షుణులకు, స్త్రీ సామాన్యమునకు సద్గుణముల నలవాటు చేయుటకు, నీతి సూత్రముల ప్రచార మొనర్చుటకు మహిళా మంత్రులను గూడ నియమించెను.

అశోకుడు తన తీర్థయాత్రలో అనేక కష్టముల పడ వలసి వచ్చెను. దేశమున రహదారి సౌకర్యములు బాగు గనే యుండెను. కాని, ప్రయాణీకులకు విశ్రాంతి తీసికొను టకు నీడ పట్టుగాని, త్రాగుటకు మంచినీటి సదుపాయములు గాని లేవు. ఎండ వానలకు ప్రయాణీకులు అవస్థ పడవలసి యుండెను. అసంఖ్యాకములగు పుణ్య క్షేత్రములు, ఆలయ ములు, ఆశ్రమములు, సంఘారామములు దేశమున ఎల్లెడల నెలకొని యున్నవి. యాత్రికుల కష్టములకు అంతు లేకుండెను. యుగములకు యుగములు గడచి పోవుచున్నను, తరములు గతించుచున్నను ఈ కష్టముల తొలగించ నెవ్వరును ప్రయ త్నించలేదు. ప్రయాణ సౌకర్యము కలిగించుటకు క్రొత్తగా మంత్రుల నియమించెను. రహదారిపై నీడనిచ్చుటకు మామిడి చెట్లను ఇరువైపుల నాటించెను. యాత్రికులకు మంచినీటిసదు పాయము కలిగించుటకు చెరువులు, బావులు త్రవ్వించెను. రాత్రులందు మకాము చేయుటకు ధర్మసత్రముల నిర్మించెను. అంతటితో ప్రయాణీకుల కష్టములు తొలగిపోయెను.

## 8. వైద్యశాలలు

అటు పిమ్మట కొంత కాలమునకు ఒక బౌద్ధ భిక్షువు తీర్థాటనకు బయలుదేరెను. అతడా వృద్ధుడు; చేయవలసినదా దూర ప్రయాణము. అతడా కలిగొని అలసట జెందియుండెను. కనుచూపు తగ్గజొచ్చెను. నడక మందగింప జొచ్చెను. కాని, బలమగు ధర్మకాంక్షయే ఆతనిని నడపించుచుండెను. లుంబిని,

కపిలవాస్తు, బుద్ధగయ, సారనాథము, శ్రావస్తి, రాజగృహము అన్నీ ఒకదాని వెంట మరియొకటి గడచివచ్చెను. కడకాతడు పాటలీపుత్రమునందలి కుక్కుటారామమునకు మరలి వచ్చుచుండ మార్గ మధ్యమున రోగ గ్రస్తుడై మరణించెను.

ఆ వార్త అశోకుని వీనుల బడెను. భిక్షువునకు సకాలములో చికిత్స జరుగనందుకు మంత్రిని పిలిచి యడిగెను. అచ్చట చికిత్స చేయుటకు తగు ఏర్పాట్లుగాని, ఔషధములుగాని అందుబాటులో లేవని ఆ మంత్రి వివరించెను.

"నా రాజ్యమందిట్టి దుర్వ్యవస్థ కొనసాగరాదు. పాటలీ నగరపు నాల్గు ద్వారములందు నాల్గు కేంద్రముల నేర్పాటుచేసి, అందన్ని రకముల యౌషధులు సిద్ధము చేసి యుంచుమ"ని ఆజ్ఞాపించెను.

"ప్రయాణీకులకు మార్గమధ్యమున సుస్తీచేసిన, చికిత్స చేయుటకు పరిసర పల్లెలందేమైన ఏర్పాటులున్నవా ?" అని తిరిగి ప్రశ్నించెను.

"ఒక వైద్యుని నియమించిననేగాని రోగికి చికిత్స చేయుటకు వీలుగ నుండదు" అని మంత్రి విన్నవించెను.

అందుపై "రాజ్యమంతటను వైద్యశాలలు నిర్మించి, రోడ్ల కిరువైపుల ఓషధుల పెంచవలసిన"దని శాసించెను.

రాజాజ్ఞ దేశమంతటను ప్రచారము చేయబడుటే గాక, శిలలపైగూడ చెక్కించెను.

"సర్వ సమ్మానితుడగు అశోక చక్రవర్తి తన రాజ్యమంతటను ప్రజల వైద్య సౌకర్యమున కవసరమగు అన్ని ఏర్పాటులు చేసెను. తామ్రపర్ని (సింహళము) నుండి చోళ,

పాండ్య, సత్యపుత్ర (మైసూరు), కేరళపుత్ర (మలబార్), అంతియోకస్ రాజ్యముగు గ్రీసువరకు ఇట్టి ఏర్పాట్లు చేసెను. మానవులకే గాక, పశువులకు కూడ వైద్యశాలలు నిర్మించెను. అవసరమగు యోషధుల రాజ్యమందంతటను నాటించి, పెంచెను" మొదలగు వివరములు ఆ శాసనములను బట్టి తెలియగలను.

ఈ శిలాశాసనము సౌరాష్ట్రమందు గిరినార్‌లో కనుగొనబడెను. ఆ కాలమున ప్రపంచమందు ఏ ఇతర చక్రవర్తి తన ప్రజా క్షేమముకొరకు ఇట్టి సదుపాయముల నేర్పాటు చేసిన రాజు లేడు. ప్రపంచ చరిత్రలో ప్రజలకు, ప్రజలతో బాటు పశువులకు వైద్యశాలల నిర్మించిన మొట్టమొదటి చక్రవర్తి అశోకుడే!

## 9. పరమత సహనము

తక్షశిలయందు ఉపరాజు తిష్యుని హత్యచేయబడిన ట్లకస్మాత్తుగ అశోకునకు వార్త వచ్చెను. ఆ వార్త అశోకునకు పిడుగుపాటుగా తోచెను. కాని, చక్రవర్తి విచారించుటకు గూడ వ్యవధిలేదు. శత్రువులా సరిహద్దులందు పొంచి యుండిరి. కన్నీరు తుడుచుకొనెను. పదునెనిమిదేండ్ల ప్రాయముగల తన పెద్దకుమారుని మహేంద్రుని తక్షశిలకు పంపెను.

చక్రవర్తి మనస్సాకుల పడుచునే యుండెను. ఆ విషాద సంఘటనకు గల కారణముల తెలిసికొన ప్రయత్నించెను.

దానికి తన అసమర్ధతే కారణమని తలంచెను. ధర్మప్రచారము ప్రజల మనస్సు మార్చుపాటిగా ప్రచారము చేయలేక పోతి నని వాపోయెను. తన పరిపాలనలో కొన్ని లోపము లుండి యుండవచ్చును. అటుల కానిచో తన రాజప్రతినిధి, తనసోదరుడు అగు తిష్యుడు తన రాజ్యమందే ఎందుకు చంప బడును? అని ప్రశ్నించుకొనెను. తన ప్రజల జీవితము మరింత సుఖవంతము చేయ ప్రయత్నించెను. "అవసరము చొప్పున యథేచ్ఛగా ప్రజలందరు సమయాసమయములతో నిమిత్తము లేకుండ — చక్రవర్తికి తమ కష్ట సుఖముల నివేదించుకొనవచ్చును. ఆలయములో నున్నను, సంఘారామ ములో నున్నను ఉద్యాన మందున్నను, అంతఃపుర వినోదము లందున్నను చక్రవర్తి ఎల్లవేళల తన ప్రజలు చెప్పుకొను కష్టములు వినుటకు సిద్ధముగ నున్నాడు. దూర ప్రాంతముల నుండి, చక్రవర్తివద్దకు స్వయముగ రాలేనివారు చక్రవర్తిచే ప్రత్యేకముగ నియమింపబడిన 'ప్రతిభేదకు'లకు తెలియ పరచవచ్చును. ప్రతియొక కష్టమును నివారించబడునని చక్రవర్తి అభయమిచ్చుచున్నాడు" అని అశోక చక్రవర్తి ప్రకటించెను.

ప్రజా సంక్షేమమును పాలించుటకు చక్రవర్తి ఆచరించ వలసిన విధానములను సూచించవలసినదిగ మహాపీఠులను సమావేశపరచి వారి నర్థించెను.

"ధర్మయాత్ర, ధర్మఘోష, ధర్మవిజయ, ధర్మదాన, ధర్మానుగ్రహ, ధర్మమంగళ, ధర్మానుస్వస్తి." ఇవి చక్రవర్తి పాటించవలసినదిగ స్థవిరులు నిర్ణయించిరి.

బౌద్ధ పుణ్య క్షేత్రముల దర్శించుట "ధర్మయాత్ర" అన బడును. అశోకుడది పూర్తిచేసి యుండెను.

ధర్మమును ప్రచార మొనర్చుట "ధర్మఘోష" యన బడును. బౌద్ధ ధర్మములను అశోకుడు స్తూపములపైన, స్తంభ ములపైన, శిలాఫలకములపైన చెక్కించెను.

శీలము, సత్యము, అహింసలతో ప్రజాహృదయమును చూరగొనుటే "ధర్మవిజయము." కళింగ యుద్ధానంతరము అశోక చక్రవర్తి అహింసా సిద్ధాంతమును తలదాల్చి, ధర్మ విధుల నిర్వర్తించి ప్రజాహృదయముల చూరగొనెను.

ధర్మ ప్రచారమునకు దానము చేయుటే "ధర్మ దానము." ధర్మ ప్రచారమునకే చక్రవర్తి తన సర్వస్వమును అర్పించెను. తన పుత్రీ పుత్రులను కూడ బౌద్ధ ప్రచారము నకే అర్పించెను.

ఇతరులకు ధర్మవిధు లాచరించుటకు సరియగు సదవ కాశములను కల్పించుటే "ధర్మానుగ్రహము." చక్రవర్తి వైద్యశాలలు ఏర్పాటు చేసెను. యాత్రికులకు వందలాది 'ధర్మరాజిక'ల నిర్మించెను. ప్రయాణ సౌలభ్యమును చేకూర్చెను.

అవినీతిని, దుర్వర్తనను నిర్మూలించి ప్రజలందు ధర్మ నిష్ఠను పెంపొందించుట "ధర్మమంగళ" మనబడును. ఈ కర్తవ్యమును గూడ చక్రవర్తి నిర్వహించెను.

తన శక్తి నంతను ధర్మోద్ధరణకు అంకిత మొనర్చుటే "ధర్మాను స్వస్తి." చక్రవర్తి తన ఐశ్వర్యమును, శక్తినికూడ ప్రజా శ్రేయస్సునకు వినియోగించెన

అశోకుడు బౌద్ధ మతము నొక్కదానిని మాత్రమే ఆదరించలేదు. ఆతడు మతముతోగాని, విశ్వాసములతో గాని, పాటించక ప్రజలందరి సదుపాయము కొరకు జాగ్రత్త వహించి, సమభావము కలిగియుండెను. ఆతడు 'రథయాత్ర' అను ఉత్సవముల ప్రవేశపెట్టెను. ఈ యుత్సవము ప్రతి సంవత్సరము జ్యేష్ఠమాసమున ఎనిమిదవ (జ్యేష్ఠశుద్ధ అష్ఠమి) రోజున వచ్చును. ఆ ఉత్సవమున ప్రజలు వెదురుతో నాల్గు చక్రముల రథములు నిర్మించెడివారు. వానికైదు అంతస్తులుండెడివి. ప్రతి అంతస్తునందు హిందూ బౌద్ధ విగ్రహముల నుంచెడివారు. ఇట్టి రథముల బారులుతీర్చి, వీధులవెంట ఊరేగించెడివారు. వందలాది దీపములతో రథములు, వీధులు అలంకరించెడివారు. బాణసంచా కాల్చెడివారు. ఈ యూరేగింపులవెంట ఏనుగులుకూడ చక్కగ అలంకరింపబడి బారులు తీర్చి వెడలెడివి. ఆ ఉత్సవ వైభవమును చూచుట కెంతయు ఆనందముగ నుండెడిది.

ఆ రథములందు హైందవ బౌద్ధ ప్రతిమలను ఒకదాని ప్రక్క మరియొకటి యుంచి, ఇరుమతస్థులు కలసి మెసలెడివారు. ఒకరితొనొకరు "మా మత మెక్కువ, మా మత మెక్కువ" యని పోరాడక, పరమత సహనము గలిగి యుండెడివారు.



# 10. బౌద్ధ సంగీతి

బౌద్ధ సిద్ధాంతముల వివరించుటలో భేధాభిప్రాయ ములు మొలకెత్తెను. సువిశాలమగు మనదేశమందు భిన్న ఆచార సంప్రదాయములు, వేర్వేరు ప్రాంతములందు వేర్వేరు విధముగ రూపొందెను. ఈ బేధముల గూర్చి ఆలో చించి, క్రమబద్ధమొనర్చుటకు ఉపగుప్తుడు పాటలీపుత్రమున బౌద్ధ సంగీతి నేర్పాటు చేసెను.

అశోకుని పట్టాభిషేక దినోత్సవమును అతి వైభవముగ ప్రతి సంవత్సరము జరిపెడివారు. ఈ దినోత్సవ సందర్భము ననే బౌద్ధ సంగీతి ఏర్పాటు చేయబడెను. చక్రవర్తి ఆసమా వేశమందు శ్రద్ధాసక్తులను కనపరచెను. ప్రతి సమావేశము నకు హాజరగుచు ఆసాంతముండి, బౌద్ధాచార్యుల వివరణ ములను వినుచుండెడివాడు. ఆసమావేశము పూర్తి యగు నప్పటికి ఆయనలో గొప్ప సంచలన మావేసించెను. ఆతనిలో ధర్మాభిరతి మిక్కుటమాయెను. ఒకనా డశోకుడు, "ఓ గురు దేవా, మన ధర్మమందు తెల్పిన గొప్ప దానమేమి ?" అని ఉపగుప్తుని ప్రశ్నించెను.

"తన ప్రియతమమగు వస్తువును ధర్మోద్ధరణకు సమ ర్పించుటేయని" ఉపగుప్తుని సమాధానము.

"మానవునకు ప్రియతమమైనదేది ?"

"పుత్రుని కన్న మానవునకు ప్రియతమమగు వస్తువు లేదు."

ఈ సంభాషణ జరుగునప్పుడు రాకుమారుడు, రాకుమార్తెయు దర్బారునందే కలరు. చక్రవర్తి ఒక చూపటు చూచెను. మహేంద్ర రాకుమారుడు ఆ చూపులోని భావమును గ్రహించి, వెంటనే నిలువబడి, "తండ్రీ, దయయుంచి నన్ను ధర్మప్రచారమునకు కానుకగా నొసర్చుము. నాకు రాజకార్యములకన్న ధర్మవిధులే సంతోషకరమైనవి" అని తెల్పెను.

మహాభిక్షువు ఉపగుప్తుడు నవ్వి, "తండ్రిచాలు బిడ్డలు, నూలుచాలు గుడ్డలు" అనెను.

నీవు భిక్షు జీవితములోని కష్టముల సహింపగలవా?" అని కుమారుని ప్రశ్నించెను.

మహేంద్రుడు చాలకాలమునుండి బౌద్ధ భిక్షువులగు మహాదేవ, మాధ్యాన్తికులకు శిష్యుడుగ నుండెను. "సంఘము, ధర్మము, బుద్ధుడు అను త్రిశరణముల పొందుచున్నాడను" అని తెల్పెను.

అనంతరము రాకుమార్తె సంఘమిత్ర ముందునకు వచ్చి "నా సోదరుని అడుగుజాడల ననుసరింతును. మీ రనుమతింపుడు" అని తండ్రికి తెల్పెను. మహా పండితులగు అయోపాలాచార్యులు, ధర్మపాల ఉపాధ్యాయులును ఆ సభయందుండిరి. "అమ్మా, నీవు వివాహితవు. నీ భర్త అనుమతి తీసికొంటివా? వాని అనుమతి లేకుండ నీ వేమియు చేయరాదు" అని ఆచార్య అయోపాలుడు రాకుమారిత నడిగెను.

"అగ్నివర్మ నాతో ధర్మతత్వశాస్త్రమును అభ్యసించెను. ఆతడు ధర్మోద్ధరణమునకు కుతూహలపడునని, నేను నమ్మచున్నాను" అని ఉపాధ్యాయ ధర్మపాలుడనెను.

చక్రవర్తి కన్నులు అల్లునిపై ప్రసరించెను.

"ఔను ప్రభూ, బౌద్ధ ధర్మోద్ధరణకు నే నేదైనను అర్పించుటకు సిద్ధముగ నున్నాను" అని అగ్నివర్మ వెంటనే సమాధాన మిచ్చెను.

సంఘమిత్రా మహేంద్రులంత ముండనము చేయించుకొని, కాషాయాంబరముల ధరించి, చేత భిక్షాపాత్రల గైకొని, బౌద్ధ భిక్షువులై, ధర్మబోధ కుపక్రమించిరి.

ఆ రోజులలో పాటలీపుత్రమునుండి సింహళము వెడలుటకు రెండువారములు పట్టెడిది. బెంగాలులో నున్న తామ్రలిప్తి రేవును చేరుటకు ఒకవారము, అచటినుండి సింహళములోని తామ్రపర్ణి చేరుటకు మరియొక వారము ప్రయాణము చేయవలయును. రిష్ట్రియుడు, ఉత్రీయుడు, సంబలుడు, భద్రసారుడు అను మరినలుగురు భిక్షుల వెంటబెట్టుకొని, మహేంద్రుడు సింహళము వెడలెను. ఆ ఐదుగురు భిక్షులు తామ్రపర్ణిలో అడుగు పెట్టగనే, ఆ ప్రాంతమందలి ప్రకృతి సౌందర్యమును గాంచి వారు తన్మయులైరి. వారొక యడవిగుండా వెడలుచుండిరి. సింహళరాజు దేవానాంప్రియ, తిష్యుడు ఆ అడవికే వేటకు వచ్చెను. వారిని చూచి ఆశ్చర్యపడి, మీరెవరని ప్రశ్నించెను.

"మేము బౌద్ధ పరిచారకులము. మగధ చక్రవర్తి, దేవానాంప్రియుడు, అగు ప్రియదర్శి అశోకుడు బుద్ధభగవానుని సందేశమును బోధించ వలసినదని మమ్మంపెను" అని మహేంద్రుడు జవాబిచ్చెను.

"తమ నామధేయముల తెలిసికొనగోరెదను."

అంత మహేంద్రుడు తనను, తనతోటి భిక్షులను పరిచయ మొనర్చుకొనెను. తామందరు ఉపగుప్తాచార్యుని శిష్యులమని చెప్పుకొనిరి.

సింహళరాజు, "మహేంద్రుడా! నీవు మగధ యువరాజగు మహేంద్రుడవు కాదుగదా?" అని ఆశ్చర్యముగ ప్రశ్నించెను.

"ఔను, వెనుక నేను రాజకుమారుడను; కాని ఇపుడు భిక్షువును; చేత భిక్షాపాత్రి ధరించిన ధర్మ పరిచారకుడను. బౌద్ధ ధర్మము పరముగ సత్యము నన్వేషించుచుంటిని."

సింహళరాజు మహేంద్రునివైపు చూచి, ఏ వ్యక్తి ఒక రోజున రాజభోగముల ననుభవించుచు, చక్రవర్తిగ అధికారమును నిర్వహించగలడో, ఎవరొకప్పుడు తన వ్రేలి చూపు మాత్రముననే ఆర్యావర్తము నంతను కంపింప చేయగలడో, ఆతడు చేత భిక్షాపాత్రను ధరించి, తన యెదుట నిరుపేద భిక్షువువలె నిలబడియున్నాడు. ఎవరొకప్పుడు చక్రవర్తిగ నుండునో ఆతడిప్పుడొక భిక్షు. రాజు తన కండ్లను తానే నమ్మలేక పోయెను. ఆతడా భిక్షుల తన రాజాస్థానమునకు రావలసినదని సగౌరవముగ ఆహ్వానించెను.

ఆ భిక్షువులు బౌద్ధ ధర్మముల రాజ కుటుంబములోని సభ్యులతో చర్చించిరి. తమ బోధలవల్ల, తమ మూర్తివల్ల, ప్రవర్తనవల్ల, వారి హృదయముల నాకర్షించిరి. సింహళ దేశీయులందరు బౌద్ధము నంగీకరించి, ధర్మ వ్యాసంగములకు కేంద్రములుగ కొన్ని విహారముల నిర్మించిరి.

మహేంద్రుడు తన సోదరి సంగమిత్రను సింహళమునకు రావలసినదని ఆహ్వానించెను. ఆమెతో ఒక బోధివృక్ష శాఖను తెమ్మనెను. అశోక చక్రవర్తి బోధి వృక్షమునుండి ఒక కొమ్మను నరకించి, తానే స్వయముగ తామ్రలిప్తి వరకు తీసికొని వెడలెను. అచ్చటినుండి సంఘమిత్ర ఆ కొమ్మను శిరమున నిడుకొని ఓడపై తామ్రపర్ణి ఏడు రోజులకు చేరెను. సింహళ రాకుమార్తె 'అనిల' ఆమెను రాజ ప్రాసాదమునకు తోడ్కొని వెడలుట కెదురేగెను. సింహళ రాకుమారి అనిల, రాకుమారి సంగమిత్రను సామాన్యమగు కాషాయ దుస్తులతో భిక్షుణి రూపమున చూచినంతనే తెల్లబోయెను. ఆసేతు శీతాచల పర్యంతము నంతను పాలించు అశోక చక్రవర్తి కుమార్తె సంగమిత్ర నిరాడంబరత్వము, భక్తి త్యాగములు, సింహళ రాకుమార్తె వైభవాడంబరములను అధఃకరించెను. కొన్ని దినములు గడచిన తరువాత, రాజలాంఛనములతో అతి వైభవముగ ఆ బోధిశాఖను నాటుటకు నిర్ణయించి, పట్టణమంతయు దీపములతోను, పుష్ప మాలతోను అలంకరించిరి. బోధి కొమ్మను ప్రతిష్ఠించిరి. అనంతరము సంఘమిత్ర సింహళ మహిళలందు బౌద్ధ ధర్మ ప్రచారము చేయ మొదలిడెను. రాకుమారి అనిల భిక్షుణీ సంఘమునకు ఆధిపత్యము వహించెను.

సంఘమిత్రికు సుమనుడను సుతుడు గలడు. ఆతని వయస్సు పదునెనిమి దేండ్లు. ఆతడుకూడ సింహళమున బౌద్ధ ధర్మమును ప్రచారముచేయ వెడలెను.

అశోక చక్రవర్తి ధర్మ ప్రచారకుల సింహళము మాత్రమేగాక, తనరాజ్యమందు ప్రతిప్రాంతమునకు పంపెను. మధ్యాంతిక భిక్షువు కాశ్మీర, గాంధారములకు వెడలెను. ఆమె అచ్చట ఎనుబది వేలమందికి బౌద్ధ దీక్ష నిప్పించెను. అలకదేవుడు, కాశ్యపగోత్రుడు, దుందుభిసారులు వెంటరా, మధ్యమభిక్షు హిమాలయ ప్రాంతమునకు వెడలి, అచట ఎనుబదివేల ప్రజల బౌద్ధములోనికి మార్చెను. మహారక్షిత భిక్షువు గ్రీకు జాతీయుడు. ఆతడు మగధలో బౌద్ధ దీక్షను పొందియుండెను. తాను అపరాంతమను గ్రీకు రాజ్యమునకేగి, ముప్పది యేడువేల మంది గ్రీకుల బౌద్ధులుగా మార్చెను. మహారాష్ట్రమునకు మహాధర్మ రక్షితుడు, మైసూరునకు మహాదేవుడు వెడలి నరువదివేల మంది స్త్రీ పురుషుల బౌద్ధులుగా నొనర్చెను. శోళోత్తరులను మరి యిరువురు భిక్షువులు నేడు పెగు, మాల్మినులను సువర్ణభూమి కేగి, అరువదివేల మందిని బౌద్ధమును స్వీకరించునట్లు చేసిరి.



# 11. అంత్య జీవితము

ఇట్లుండ, అశోకుని పట్టమహిషి అసంధిమిత్ర దివంగతు రాలయ్యెను. ఆమె బౌద్ధోపాసిక. ఆమె మరణానంతరము తిష్యరక్షిత పట్టపురాణి యయ్యెను. ఆమె బౌద్ధమునందు అంతగా ఆసక్తి కలిగినదిగాదు. చక్రవర్తి బుద్ధునియందు, బుద్ధుని మతమునందు ఎక్కువ ఆదరణను చూపుటామెకు నచ్చలేదు. మరియొక వైపున బౌద్ధులన బ్రాహ్మణులకు ద్వేషము రగులుచుండెను. తిష్యరక్షిత పట్టపు దేవియైన అవ కాశమును బ్రాహ్మణులు వినియోగించుకొన తలంచిరి. రాణి చెంతకు జేరిరి. బౌద్ధ భిక్షువులు రాజునకు మంత్రి శక్తిని ప్రయోగించి, తమ చేతి కీలుబొమ్మగా చేసికొనిరి. ధర్మ ప్రచారము పేరిట రాజధనము నపహరించుచున్నారు. అనతి కాలముననే ఖజానా యంతయు ఖాళీయగును. ధనము పోయిన నేమున్నది. సామ్రాజ్యము మాత్రమెట్లు నిలుచును. అని ఏవేవో చెవి నిల్లుగట్టుకొని రాణిని నమ్మించిరి. బ్రాహ్మ ణులు మగధ రాజ్యమున బౌద్ధమునకుగల ప్రభావమును దెబ్బ తీయుటకు యత్నములు చేయజొచ్చిరి. వారు బోధి వృక్షము తల్లివేరును తెగనరకి చంపుటకు భూమిలో నొక సొరంగ మును త్రవ్విరి. కాని అందొక బ్రాహ్మణుడు మిగిలిన వారితో ఏకీభవించలేదు. అతడా విషయము రాకుమారుడు ధర్మవివర్ధనునికి తెలియపరచెను. అంతడాతడు బోధివృక్షమును రక్షించుటకు బుద్ధగయకు హుటాహుటిగ చేరెను. భూమిలో

త్రివ్వించిన సారంగ మెచ్చట నున్నదో కనుగొని, పూడ్పించి వృక్షమునకు హాని జరుగకుండ కాపు పెట్టించెను.

ఈ వార్త రాజ్యము నలుగడల పాకిపోయెను. ప్రజలీ విషయమును చిలువలు పలువలు జేసి చెప్పుకొన జొచ్చిరి. బ్రాహ్మణులు కొందరు మరల రాణివాసమున చేరి, "మన పేళ్లు ప్రజలనోళ్ళ నానుచున్నవి. సవతితల్లి రాణి వైనందులకు సహింపనోల్లక యువరాజు ధర్మవివర్ధనుడు ఈ మాయోపాయమును పన్ని, తమ పేరు రచ్చకీడ్చె"నని రాణితో చెప్పిరి.

రాణి ధర్మవివర్ధనునిపై ఉగ్రురాలై, అవకాశమున కెదురు చూచుచుండెను. ఆమె తలంచినట్లు అవకాశము కూడ లభించెను. మహేంద్ర రాకుమారుడు సింహళములో నుండుట వల్ల, చక్రవర్తి ధర్మవివర్ధనుని తక్షశిలకు ఉపరాజుగ నియమించెను. చక్రవర్తి సంతకముతో ఆజ్ఞాపత్ర మొకటి రాకుమారుడు తక్షశిల చేరకుండగనే చేరెను. "రాకుమారు డచ్చటికి చేరిన తక్షణము ఆతని కనుగుడ్లు పెరకి వేయు"డని ఆ ఆజ్ఞాపత్రమున వ్రాయబడి యుండెను.

హిమాలయములందు కుణాళమను పక్షి యుండును. ఆ పక్షి యాకృతి చూచుట కెంతయు సొంపుగ నుండును. ఆ పిట్టను పోలిన రాకుమారుని నేత్రములు చూచుటకు చాల సొగసుగ నుండుటచే అశోకు డాతనిని 'కుణాళు' డని ముద్దుపొప్పున పిలువజొచ్చెను. రాకుమారుడు తక్షశిల చేరి అందుకొనిన మొకటి పత్రము చక్రవర్తి పేరవచ్చిన

ఆజ్ఞాపత్రము. ఆతడది చదువుకొని, ఒక్క క్షణము కూడ ఆత డాలోచించక, సంకోచించక, "మంచిది; నా కనుగుడ్లను పీకివేయుడు. నా తండ్రి ఆజ్ఞకు నేను విధిగా లోబడవలయును. మా తండ్రిగారెప్పుడును పొరబడుట సంభవింపదు. నాయందే దోషముండి యుండవచ్చును" అని చెప్పెను.

వెంటనే ఆజ్ఞ అమలు జరుపబడెను.

అంధునకు రాచకార్యముల నిర్వర్తించుట సాధ్యము గాదు. చక్రవర్తికి తనయం దిష్టము లేదను భావము కుణాళునకు పొడమెను. ఇష్టమున్న అట్టి యాజ్ఞ విధించడు గదా యని విరక్తిజెంది, బౌద్ధ భిక్షువుగా మారెను.

ఆ దుర్వార్త అశోకునకు చేరెను. ఆతడా వ్యవహారమును సాకల్యముగా విచారణ జరిపించెను. ఆ ఆజ్ఞాపత్రము కల్పితమని, బ్రాహ్మణులు రాణితో కలసి కుట్రచేసిరని చక్రవర్తికి గూఢచారులు ఆచూకీ ఇచ్చిరి. బుద్ధభగవానుని ధర్మబోధల గాన మొనర్చుకొనుచు, ఇంటింట భిక్ష మెత్తుకొనుచు తిరుగాడుచున్న అంధభిక్షువు కుణాళుని కనుగొని, తండ్రి కప్పగించిరి.

చక్రవర్తి అంధుడగు కుమారుని చూచుటతోడనే కన్నీరు నించుకొని, కృంగిపోయెను. ఇంత జేసియు ఇంట నున్న వారి మనసు మార్చలేనపుడు, తానెట్లు ప్రజల మన్ననల చూరగొనగలనని ప్రశ్నించుకొనెను. ఇంట గెలిచిన గదా రచ్చ గెలుచుట! తాను బౌద్ధాభిమాని యయ్యెను, పొరబాటునైన ఒక్క బ్రాహ్మణునకు కూడ అపచారము చేసి

ఎరుగడు. అనుదినము ఆరువేల బ్రాహ్మణులు రాజ సువార మున భోజనముస లేచుచుండెడివారు. అయినను, వారు కృతజ్ఞత చూపకున్నారు. స్వార్థబుద్ధి ముందు మానవత్వము తలవంచక తప్పినది కాదు. అగ్రకులజులు, వైదిక విజ్ఞానము నకు ప్రతినిధులైన బ్రాహ్మణులు కుట్రదారులుగ పరిణ మించిరి. అశోకుడు నిరాశోపహతుడయ్యెను. సింహాసనము త్యజించెను. కుక్కుటారామమును శరణు పొందెను. కుణా లుని కుమారుడు 'సంప్రతి' సింహాసన మెక్కెను.

నాడు ఉత్తర భారతమున గల బౌద్ధ భిక్షువుల సంఖ్య మూడులక్షలు పైబడి యుండెను. ప్రతి ఐదు సంవత్సరములకు వారు పాటలీ పుత్రమున బౌద్ధ ధర్మముల చర్చించుటకు పరి షత్తుల నేర్పాటు చేసెడివారు. ఆ పరిషత్తులకు చక్రవర్తి వసతి భోజన సదుపాయముల నేర్పాటు చేయుచుండెడివాడు. అశోకుడు సింహాసనమును పరిత్యజించిన సంవత్సరమున కా పరిషత్తు జరుగవలసి యుండెను. అన్ని దిక్కులనుండి భిక్షు వులు పాటలీపుత్రము చేరుకొనుచుండిరి. చక్రవర్తి వారి ఏర్పాట్లకై మనుమడైన సంప్రతిని ధన మివ్వగోరెను. "చక్ర వర్తి దాన ధర్మములతో బొక్కసము నిండుకొన్నది" అని సంప్రతి నుండి జవాబొచ్చెను. ఆ జవాబు చాలదన్నట్లు సంప్రతి సిగ్గుమాలి ఒక ఉసిరిచెక్కను మట్టిమూకుడులో పెట్టి అతి భద్రముగ చక్రవర్తికడ కంపుచు, "నీవు మిగిల్చి పోయిన దిదియే" అని వ్రాసి పంపెను.

సాధు పుంగవుడగు అశోకుడు నవ్వలేక నవ్వి, "సేతు శీతాచల పర్యంతము వ్యాపించియున్న జంబూద్వీపమును పరిపాలించిన మహా చక్రవర్తికి నేటికి మిగిలిన ఆస్తి ఒక్క ఉసిరిచెక్క మాత్రమే బుద్ధ భగవానుడా! ఇక నీదే భారమని" తన చుట్టునున్న భిక్షులతో పల్కెను.

"బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి"

చక్రవర్తి దుర్ఘటనకు తట్టుకొనలేక, కొలది దినములలోనే భౌతిక దేహమును వీడెను.

అశోకుని వంటి దయాస్వరూపుడగు చక్రవర్తి ఈ ప్రపంచమున ఇంతవరకు మరొకరు పుట్టలేదు. ఆతడు చక్రవర్తి మాత్రమే కాదు; మానవాతీతుడు.

———:x:———



# అశోకుని జీవితమున ముఖ్య వత్సరములు :



| | | | |
|---|---|---|---|
| క్రీ. పూ. | 304 | — | అశోకుని జననము. |
| ,, | 286 | — | 18వ సంవత్సరమున ( శాక్య కుమారీ) దేవిని వివాహ మాడెను. |
| ,, | 284 | — | మహేంద్రుని జననము. |
| ,, | 282 | — | సంఘమిత్ర జననము. |
| ,, | 274 | — | బిందుసారుని మరణము; అన్న సుషీముని యుద్ధమున ఓడించి సింహాసన మెక్కెను. |
| ,, | 270 | — | పట్టాభిషేకము; రాణి అసంధిమిత్ర. |
| ,, | 266 | — | కళింగయుద్ధము, బౌద్ధమును స్వీకరించుట |
| ,, | 263 | — | కుణాళుని జననము. |
| ,, | 260-250 | — | తీర్థయాత్ర. |
| ,, | 252 | — | మహేంద్రుడుసింహళము వెడలెను. |
| ,, | 240 | — | అసంధిమిత్ర మరణము; రాణి తిష్యరక్షిత. |
| ,, | 235 | — | కుణాళుడు తక్షశిల కేగెను. |
| ,, | 232 | — | అశోకుడు కాలధర్మము నొందెను; వయస్సు 72. |



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B175 |
| పుస్తకం పేరు | ప్రియదర్శి అశోక |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | No |
| వెనుక అట్ట | No |
| మొత్తం పేజీలు | 60 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | No |
| పరిస్థితి | good |